# నాచన సోమన భక్తితత్త్వం

డా॥ యం. గోవిందస్వామి నాయుడు

విష్ణు ప్రచురణాలు
తిరుపతి.

ప్రథమ ముద్రణ
జూన్ 1988



ప్రతులు : 1000
వెల : రూ. **15-00**

ప్రతులకు :
శ్రీమతి కె. చంద్రకళ
C/o డా॥ యం. గోవిందస్వామినాయుడు
5-5-313A, సరోజినీదేవి లేఅవుట్
తిరుపతి - 517507

ముద్రణ :
వెరైటీ ప్రింటర్స్
చల్లబజార్
ఏలూరు - 1.



This book is
Published with the
financial assistance of
Tirumala Tirupati Devasthanams
under their Scheme
"AID TO PUBLISH RELIGIOUS BOOKS"

మా తండ్రి

## మానికొండ రామనాయుడుగారి దివ్యస్మృతికి



రూపం ఇచ్చావు
భవిష్యత్తుకు రూపకల్పన చేశావు
సంస్కారంతో సంస్కారం పెంచి
మంచిస్థాయికి ఎదిగేట్టు చూశావు
హలం పట్టినా
హలమూ కలమూ పట్టింది
గళం ధ్వనింపజేశావు.
చంద్రుడా !
ఇవ్వలేను చంద్రుణ్ణి
నూలుపోగు అందుకో.

# నమస్క్రియ

విద్యార్థిదశలో గురువుగా పరిశోధనాదశలో నేతగా పరిశోధనపట్ల మక్కువ ఎక్కువచేసి సద్విమర్శపట్ల అభిరుచిని పెంచి ప్రోత్సహించిన సహృదయులు ఆచార్య జి.యన్. రెడ్డిగారికి,

'నాచనసోమన భక్తితత్త్వం' అనే శీర్షికను సూచించి ఈరచనకు పురికొల్పిన అధ్యాపకులు డా॥ కె సర్వోత్తమరావుగారికి,

రచనావ్యాసంగంలో తన సంపూర్ణ సహకారాన్ని అందజేసిన మిత్రుడు డా॥ జె. మునిరత్నంగారికి, ప్రచురణ విషయంలో సూచనలిచ్చిన మిత్రుడు డా॥ సి. గోవిందరాజుగారికి,

పుస్తకసామగ్రిని అందించిన శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయ గ్రంథాలయ సిబ్బందికి, శ్రీవేంకటేశ్వర ప్రాచ్యలిఖిత పరిశోధన పుస్తక భాండాగార సిబ్బందికి,

ఈపుస్తక ప్రచురణకు ఆర్థికసహాయాన్ని అందజేసిన తిరుమల తిరుపతి దేవస్థానం వారికి,

సకాలంలో చక్కగా ముద్రించి ఇచ్చిన వెరైటీ ప్రింటర్స (వేలూరు) వారికి,

నా కృతజ్ఞతా పూర్వకవందనాలు.

**డా॥ యం. గోవిందస్వామినాయుడు**

# అభిప్రాయం

భారతీయ సాహిత్యంలో భక్తితత్త్వానికి ఉన్నంత ప్రాధాన్యం ప్రపంచంలో వేరొక సాహిత్యంలో లేదనడం వాస్తవమయిన విషయం. వివిధ భారతీయ భాషా సాహిత్యాలకు మూలకందాలయిన అష్టాదశ పురాణాలు భగవదంశ ప్రశస్తికి పట్టు గొమ్మలు. దైవభక్తి ముక్తికి మార్గమని హిందువుల విశ్వాసం. లౌకిక జీవితం దైవచింతనతో ముడిపడి ఉండాలన్నది అన్ని మతాలవారు అంగీకరించే విషయం. అయితే భక్తిస్వరూప నిరూపణలో భారతీయులకొక ప్రత్యేకత ఉంది. విషయ విశ్లేషణలో సూక్ష్మ భేదాల్ని గుర్తించే నేర్పుగల ప్రాచీన భారతీయులు భక్తి తత్త్వంలో కూడా వైవిధ్యాన్ని దర్శించగలిగారు. మానవప్రవృత్తి వైవిధ్యభరితం. లోకోభిన్నరుచిః. కాబట్టి మానవప్రవృత్తి పరమైన దైవభక్తిలో కూడా వైవిధ్యం అనివార్యం. మన పురాణాల్లోని మహనీయుల ఐతిహ్యాలు, భక్తుల గాథలు భక్తి స్వరూప వైవిధ్యానికి దృష్టాంతాలు; అసక్తిదాయకాలు.

భక్తి విధానంలోగల వైవిధ్యానికి చక్కని ఐతిహ్యాలు హరివంశ పురాణంలో కన్పిస్తాయి. ఎఱ్ఱాప్రెగ్గడ రచించిన హరివంశంలోను, నాచనసోమన కృతమై ఉత్తరహరివంశంలోను అటు కవితాశిల్పానికి ఇటు దైవభక్తి ప్రతిపాదనకు సమ ప్రాధాన్యాన్ని చూడవచ్చు. నాచనసోముని ఉత్తరహరివంశంలో ప్రధాన కథల ఆరుమాత్రమే. అవి కథాసంవిధాన వైచిత్రికి సుప్రసిద్ధాలు. ఉత్తమ కవి విమర్శకుల దృష్టిభేదాన్నిబట్టి నిత్యనూతనంగా ప్రసన్నమవుతుంది. మన సాహిత విమర్శకులు సోముని కాలనిర్ణయాన్ని గురించి, కవితా ప్రాశస్త్యాన్ని గురించి విస్తృ పరిశీలన చేశారు. వాదోపవాదాలు కూడా నిర్వహించారు. కాని నాచనసోమ హరివంశంలో ప్రతిపాదితమయిన భక్తిస్వరూపాన్ని గురించి ఎవరూ ప్రత్యేకిం పట్టించుకోలేదు. ఆలోటును పూరించడానికా అన్నట్టు డా॥ గోవిందస్వామినాయు "నాచనసోమన భక్తితత్త్వం" అనే గ్రంథాన్ని రచించి ప్రచురించడం ముదావహ ఈ గ్రంథం కొంతవరకు అపూర్వమయిన రచన. అందుకు డా॥ గోవిందస్వా నాయుడిని అభివందిస్తున్నాను.

సాహిత్యరంగంలో నాచనసోమనకున్న ప్రత్యేకతల్లో భక్తి కూడా ఒకట నిరూపించడం ఈ గ్రంథంలోని ప్రత్యేకత. సోమన ప్రతిపాదించిన భక్తితత్త్వా సప్రమాణంగా, సోదాహరణంగా విశ్లేషించి చూపడం ఈ రచనలో మెచ్చ విషయం. సోమన పద్యాల్లో సాహిత్యశిల్ప దృష్టికి విలక్షణంగా కన్పించే వాటిల భక్తికి సంబంధించిన అంశాలను చూడడం రచయిత డా॥ గోవిందస్వామినాయ నిశితదృష్టికి నిదర్శనం. సోముని ఉత్తర హరివంశంలో కొన్ని సరికొత్త అంశా సాహిత్యలోకానికి తెలియజేసిన డా॥ గోవిందస్వామినాయుడు ప్రాచీన తెల సాహిత్యప్రియులందరికీ అభినందనీయుడు.

తిరుపతి

20-6-1988

ఆచార్య జి. యస్. ర

# ప్రవేశిక

బాల్యం నుండీ నాకు ప్రాచీన సాహిత్యం మీద అభిరుచి, అవగాహన ఏర్పడ్డాయి. నేను ఎం.ఏ. చదువుతున్న రోజుల్లో ప్రాచీన గ్రంథపఠన కొంత వరకు సాగింది. ఫైనలియర్‌లో ఉన్నప్పుడు నాచనసోమన ఉత్తరహరివంశం ప్రత్యేక పాఠ్యభాగంగా మా పాఠ్యప్రణాళికలో స్థానం పొందింది. దాన్ని నేను ఐచ్ఛికాంశంగా తీసికొన్నందువల్ల నాకది అవశ్యపఠనీయ మయింది. అప్పటి మా అధ్యాపకులు డా॥ కె. సర్వోత్తమరావుగారు ఉత్తర హరివంశంలోని ప్రతి అంశాన్నీ క్షుణ్ణంగా అవగాహనమయ్యేట్టు బోధించారు. అందులోని సాహితీ సౌందర్యాన్ని మనోనయనగోచరం చేశారు. భక్తితత్త్వాన్ని తెన్నుగా బోధపరచారు. భాషా విశేషాల్ని సులభగ్రాహ్యం చేశారు. తదాదిగా నాకు సోమన ఉత్తరహరివంశం పట్ల అభిమానం పెరుగుతూ వచ్చింది. వివిధకోణాల్నుంచి పరిశీలించి దాని వస్తువైభవాన్ని పాఠకలోకానికి తెలియజేయాలనిపించింది. కొన్ని వ్యాసాల్ని కూడా పత్రికాముఖంగా పాఠకుల కందజేశాను.

ఇప్పుడు నాచనసోమన భక్తితత్త్వాన్ని పాఠకుల ముందుంచాలనే సంకల్ప ముదయించింది. దీనివల్ల పుణ్యమూ పురుషార్థమ్మూ సిద్ధించడమేగాక పాఠకుల్లో కూడ కొంత సద్విషయ చింతన కలుగుతుందనే విశ్వాసం నన్ను పురికొల్పింది సాహితీ మిత్రులు, పెద్దలు ప్రోత్సహించారు. పర్యవసానంగా 'నాచనసోమన భక్తితత్త్వం' అనే ఈ చిన్న పుస్తకం రాయడం జరిగింది. ఇందులో నాలుగధ్యాయాలున్నాయి. మొదటి అధ్యాయంలో నాచనసోమన ప్రదేశం, కాలం, ఇతరగ్రంథాలు, బిరుదాలు అనువాద వైఖరి మొదలయిన అంశాలు సవివరంగా చర్చింపబడ్డాయి. రెండో, అధ్యాయంలో ఉత్తరహరివంశ కథా పరిశీలనం సాగింది. మూడో అధ్యాయంలో భక్తి, అందలి రకాలు, సోమన ప్రతిపాదించే భక్తితత్త్వం అనే అంశాల్ని గురించి విస్తృతంగా చర్చింపబడింది. నాలుగో అధ్యాయంలో శ్రీకృష్ణ నారాయణ నిరూపణ, శైవ వైష్ణవ సంప్రదాయాలకు చెందిన అంశాలు, హరిహరనాథతత్త్వం మొదలయిన సోమన ప్రత్యేకతలు విపులీకరింప బడ్డాయి. ఈ పుస్తకాన్ని ఆదరించడం ద్వారా ఆంధ్రపాఠకలోకం సోమునిపట్ల తమకు గల ఆదరాభిమానాల్ని అభివ్యక్తం చేస్తుందని ఆశిస్తున్నాను.

**డా॥ వనావికొండ గోవిందస్వామినాయుడు**

# విషయ సూచిక





# 1. నాచన సోమన - ఒక అవగాహన

1. 0 ఆంధ్ర వాఙ్మయంలో కవిత్రయంతో సమానుడుగా కొన్ని అంశాల్లో వారికంటె అధికుడుగా కీర్తింపబడిన ప్రజ్ఞావంతుడు నాచన సోమనాథుడు. 'ఆశికంబున అక్షిని దాచినట్టి సర్వజ్ఞుడ'ని చిన్నయ సూరిచే స్తుతింపబడిన ప్రతిభావంతుడు. ఈ కవి నియోగి బ్రాహ్మణుడు. ఆపస్తంబ సూత్రుడు. భారద్వాజస గోత్రుడు. నాచన కుమారుడు.

1. 1 నాచన సోమన కాలంలాగే వాసస్థానం కూడా వివాదాస్పదంగానే ఉంది. పండితులిందుకు సంబంధించి రెండు విధాల అభిప్రాయాల్ని వెలిబుస్తున్నారు. విద్యానగరాధిపతి అయిన సంగమ బుక్క భూపాలుని ద్వారా నేటి కడప మండలం లోని పెంచుకలదిన్నె గ్రామాన్ని ప్రతిగ్రహించడం వల్ల ఈకవి కడప మండలం వాడయి ఉండవచ్చునని కొందరి అభిప్రాయం. ఉత్తర హరి వంశమే గాక వసంత విలాసమనే మరో గ్రంథాన్ని కూడా సోమన రచించాడు. లక్షణ గ్రంథాల్లో ఉదాహృతమయిన ఈ పద్యాన్ని బట్టి దాని కృతిపతి మాచయ బ్రాహ్మదని తెలుస్తూఉంది.

ఉ॥ శ్రీ చన్నుంగవ ద్రేవఁ గ్రొమ్మెఱుగులన్ శృంగారపుం బోటులన్
బ్రాచీనంబగుచున్న వింశతి నఖప్రౌఢిన్ సుధాంబోధి వే
లా చంద్రోదయమైన దేవుడు కృపాలంకార చిత్తంబునన్
జూచున్ మాచయ బ్రహ్మధీమణిఁగవిస్తోమైక చింతామణిన్'1

ఈ మాచయ బ్రహ్మని శాసనం పల్నాడు తాలూకా కారెంపూడిలో ఉంది. కాబట్టి ఈ కవి గుంటూరు మండలం వాడే కావచ్చునని కొందరి విశ్వాసం.

1.2. ఈ విధంగానే సోమనకాలం గురించి కూడా పండితుల్లో భిన్నాభిప్రాయాలున్నాయి. కాలచర్చకు బుక్కరాయల దానశాసనంలోవిగా పండితులూహించిన పాఠభేదాలు. సోమన రచించిందిగా చెప్పబడే వసంతవిలాసకృతిపతి అయిన మాచయ బ్రహ్మయ జీవించిన కాలం ఆధారాలుగా తోస్తున్నాయి,

---

1. ఉత్తర హరివంశము-పీఠిక (ప్రభాకరశాస్త్రి, వేటూరి) పుట-3

1.2.1. విజయనగర సామ్రాజ్య నిర్మాణానికి కారకులు హరిహరరాయలు, బుక్కరాయలు. వీరిలో బుక్కరాయలు ద్వితీయుడు. హరిహరరాయలు క్రీ॥శ॥ 1336వ సంవత్సరం నుండి క్రీ॥శ॥ 1350వ సంవత్సరం వరకు పరిపాలించాడు. ఇతడపుత్రుడై క్రీ॥శ॥ 1350వ సంవత్సరంలో మరణించగా సోదరుడయిన బుక్కరాయలు రాజ్యానికి ప్రభువై క్రీ॥శ॥ 1350 నుండి క్రీ॥శ॥ 1377 వరకు పరిపాలించాడనడానికి ఎన్నో చారిత్రకాధారాలున్నాయి. బుక్కరాయలు విద్యారణ్యకృత విద్యానగర రత్న సింహాసనం నుండి శ్రీ విరూపాక్షస్వామి సన్నిధిని శాలివాహన శకం 1266వ సం॥ తారణ సంవత్సర చైత్రశుక్ల నవమినాడు పినాకినీ తీరానగల పెంచుకల దిన్నె అనే గ్రామాన్ని అష్టాదశ పురాణాల అర్థాన్నెరిగినవాడు, అష్ట భాషాకవిత్వ శ్రీమహితుడు, నాచన కుమారుడు అయిన సోమునికి ధారాదత్తం చేశారు. ఈ విధంగా స్వీకరించిన గ్రామాన్ని 110 భాగాలుగా చేసి అందులో 36 భాగాల్ని తాను గ్రహించి తక్కిన భాగాల్ని ఆయా బ్రాహ్మణులకు వేర్వేరుగా సోమన లిఖింప జేసినట్లాధారాలున్నాయి. కానీ ఈ మహాకవి కాలనిర్ణయానికి ఉపయోగపడే దాన శాసనంలో కాలాన్ని తెలియజేసే చోట్లనే అక్షరాలు సరిగా కనిపించడంలేదు. అందువల్ల పండితులు వివిధ రకాలుగా చదివి సోమన కాల నిర్ణయం చేశారు.

సోమన కాల నిర్ణయానికి ప్రధానంగా నాలుగు స్థితులేర్పడ్డాయి. 1) రసభూ నయనేందుభిః - 6121. 'అఙ్కానాం వామగతిః' అనడం వల్ల శాలివాహన శక మవుతుంది. 1216. శాలివాహన శకానికి 78 కలిపితే క్రీస్తుశకమవుతుంది. కాబట్టి 1216 + 78 = క్రీ॥శ॥ 1294. 2) రసాభ్రనయనేందుభిః - 6021. శాలివాహన శకం 1206 క్రీ॥శ॥ 1284 3) కరాజ నయనేందుభిః - 2921. శాలివాహనశకం 1292 క్రీ॥శ॥ 1370. 4) రసర్తు నయనేందుభిః - 6621. శాలివాహన శకం 1266 క్రీ॥శ॥ 1344.

### 1.2.1.1 రసభూనయనేందుభిః :

6121. శాలివాహనశకం 1216. క్రీ॥శ॥ 1294. రైసుదొరవారు స్వయంగా "This is given as the saka year Rasabhunayana Indu = 1216, the

year tarana. But does not fall with in Bukka's reign during which there was no Tarana''2 అని రాశారు. ఈ కాలం బుక్కరాయల రాజ్యకాలం నాటిదిగాదు. అప్పటికతడు జన్మించికూడా ఉండడు. రాజ్యపాలన చేసే సమయంలో గ్రామాన్ని దానం చేసినట్టు పై శాసనం చెబుతూ ఉంది. అతని పాలనారంభ సంవత్సరం మన్మథ చివరి సంవత్సరం నల. ఈమధ్య కాలంలో తారణ సంవత్సరం లేదు కాబట్టి పై పాఠం పూర్తిగా లేఖన ప్రమాదమయి ఉండవచ్చు.

1.2.1.2. రసాభ్ర నయనేందుభిః :

6021. శాలివాహనశకం 1206 క్రీ॥శ॥ 1284. ఈ పాఠాన్ననుసరించి తారణ సంవత్సరం సరిపోతూ ఉంది. కాని హరిహరరాయలు శ్రీ విద్యారణ్య శ్రీపాదుల ఆజ్ఞానుసారంగా క్రీ॥శ॥ 1336 ఏప్రిల్ 18వ తారీఖున [ధాత్రనామ సంవత్సరం వైశాఖ శుక్ల సప్తమి సింహలగ్నంలో] పురనిర్మాణం చేసినట్టు కావలూరు శాసనాన్ని బట్టి తెలుస్తూ ఉంది, హరిహరుని రాజ్యకాలంలో వేయించిన దాన శాసనాల్లో మొదటిది శాలివాహన శకం 1346వ సంవత్సరం లోనూ చివరిది క్రీ॥శ॥ 1355 వ సం॥ నవంబరు 20వ తేది నాటిదిగానూ కనిపిస్తున్నాయి. రెండవ హరిహర రాయలు శివసాయుజ్యాన్ని పొందిన తన తండ్రి బుక్కరాయల పుణ్యానికై క్రీ॥శ॥ 1377వ సం॥ ఫిబ్రవరి 24వ తేదీన దానం చేసి శాసనాన్ని వేయించాడు. సంగమ రాజకుమారులయిన హరిహర, కంప, బుక్కరాయ, మారన్న, ముద్దన్నలయిదుగురు బల్లప్పదండనాయకుడు, కుమార శ్యామన్న తమ దిగ్విజయ జ్ఞాపకార్థం క్రీ॥శ॥ 1346వ సం॥ శృంగేరి పీఠాధిపతి భారతీతీర్థ శ్రీపాదులవారికి దానం చేసినట్టు ఆధారాలున్నాయి. విద్యానగర నిర్మాణానికి సంబంధించిగానీ సంగముని పుత్రుల్లో ఏ ఒక్కరు వేయించిన దానశాసనాల్లోగానీ క్రీ॥శ॥ 1280-1290 అని కాలం చెప్పబడక పోవటం వల్ల ఈపాఠం కూడా ప్రమాద జనితమే అవుతూ ఉంది.

1.2.1.3. కరాజనయనేందుభి :-

2921 శాలివాహనశకం 1292 క్రీ॥శ॥ 1370 ఇది కేవలం పండితులు సృష్టించిన పాఠమేగానీ నిజమయిన దానశాసన పాఠంగాదు. బుక్కరాయలు క్రీ॥శ॥

---

2. ఆంధ్రకవుల చరిత్ర. ప్రథమభాగం. పుట 328

1355 - 1377ల మధ్యకాలంలో విద్యానగర సింహాసనమధిష్ఠించాడనడానికి ఆధారాలున్నాయి దీనికనుగుణంగా శాసనపాఠం మార్పు చేసినట్లు తెలుస్తూ ఉంది. అయినా మార్పుచేసిన సంవత్సరం తారణ కావడంలేదు. బుక్కరాయల రాజ్యకాలంలో తారణ సంవత్సరం కాదు. కాబట్టి తారణకు సమీపంగా ఉన్న సాధారణ నామ సంవత్సరం తీసుకోబడింది. మూలానికి ప్రతికల్ని రాసేటప్పుడు గానీ శాసనకారుని శ్లోకాల్ని చెక్కేటప్పుడు గానీ ప్రమాదాలు దొర్లితే ఏదో ఒక అక్షరం తొలిగే ప్రమాదంఉంది కానీ అతిప్రధానమయిన సంవత్సరనామం పొరపాటుగా చెక్కబడటం అసంభవం. పైశాసనంలో పూర్వోత్తరార్థాలు రెంటినీ మార్చడం అసంగతం

## 1.2.1.4. రసర్తునయసేందుభి :-

6621 శాలివాహనశకం 1266 క్రీ॥శ॥ 1344 దాన శాసనంలో అక్షరాలు స్పష్టంగా కనిపించక పోవడంవల్ల ఏర్పడిన పాఠభేదాలన్నిటికంటె సమంజసంగా ఉండేట్లు వేటూరి ప్రభాకరశాస్త్రిగారీ పాఠాన్ని సవరించి ప్రకటించారు నాగర లిపిలో 'భూ'-'త్రి'-'ర్తు' అనే అక్షరాలు దాదాపు ఒకే విధంగా ఉంటాయి, బుక్కరాయల శాసనంలో కనిపించే తారణ సంవత్సరం శాలివాహనశకం 1266 (క్రీ॥శ॥ 1344). ఈ సంవత్సరం నాటికి బుక్కరాయలు రాజ్యానికి రాలేదు. అలాంటప్పుడు అతడు విద్యానగర రత్న సింహాసనం నుండి దానమెలా చేయగలిగాడనే వాదంఉంది, ఎపిగ్రాఫికా కర్ణాటిక 5వ సంపుటం హసన్‌జిల్లా చెన్నరాయ పట్టణం (256 సంఖ్య గలది) శాసనంలో హరిహరరాయలు రాజుగా ఉన్నా వాస్తవానికి విద్యానగరాన్ని నిర్మింపజేసినవాడు, నామకరణం చేసినవాడు బుక్కరాయలనే ఉంది. అగ్రజుడయిన హరిహరరాయలు రాజుగా ఉన్నా, సర్వసమర్థుడయిన తమ్ముడు బుక్కరాయలు యువరాజుగా ఉండటంవల్ల దానశాసనాన్ని ఇలా వెలయించడం అసంగతంకాదు. ఈ వాదాన్నే వేటూరి శివరామశాస్త్రిగారు, దేకుమళ్ల అచ్యుతరావుగారు, చాగంటి శేషయ్యగారు బలపరిచారు.

1.2.2. నాచన సోముని కాలానికి ఉపయుక్తమయ్యే రెండో ఆధారం మాయ బ్రహ్మయకాలం. సోమన ఉత్తర హరివంశాన్నేగాక వసంతవిలాసమనే గ్రంథాన్ని కూడా రచించినట్టు లక్షణకారులు ఉదాహరించిన పద్యాల్ని బట్టి తెలుస్తుంది. ఆ

నాచనసోమన భక్తితత్త్వం

వసంత విలాస కృతిపతి మాచయ బ్రహ్మయ. వసంత విలాసంలో మొదటి పద్యం "శ్రీ చన్నుంగవ కేవం గ్రొమ్మొఱుగులన్.........కవిస్తోమైక చింతామణిన్" అని మానవల్లి రామకృష్ణ కవిగారు ఉదాహరించినట్టు వేటూరి ప్రభాకరశాస్త్రిగారు చాటు పద్యమణి మంజరిలో రాజప్రశంసా స్తబకంలో చేర్చారు. పై పద్యాన్ని బట్టి వసంతవిలాసకృతిపతి మాచయ బ్రహ్మ అని తెలుస్తూ ఉంది.

మానవల్లి వారు మాచయ బ్రహ్మ బ్రాహ్మణ సర్దారుడనీ అతని కాలం క్రీ॥శ 1330 అని తెలిపారు. వేటూరివారు కూడా పలనాడు తాలూకాలో కారెంపూడి గ్రామంలో మాచయ బ్రహ్మదాన శాసనాల్ని చూచినట్టు ఉత్తర హరివంశ పీఠికలో రాశారు. చాగంటి శేషయ్యగారు క్రీ॥శ॥ 1304 నాటి మాచయ బ్రహ్మశాసనాలున్నాయనీ, మాచయగారి బ్రహ్మయ అని భావిస్తే ఈ కాలం సరిపోతుందని అభిప్రాయ పడ్డారు అందువల్ల క్రీ॥శ॥ 1304వ సంవత్సరంనాటి వాడు మాచయ కాగా అతని పుత్రుడు బ్రహ్మయ క్రీ॥శ॥ 1330-1335 మధ్యకాలంవాడు కావచ్చు. ఆ కాలంలో నాచన సోమన వసంత విలాస గ్రంథాన్ని బ్రహ్మయకు కృతి ఇచ్చి ఉండవచ్చునని తెలిపారు.

123 దేవరపల్లి వేంకట కృష్ణారెడ్డిగారు గ్రంథాధారాల్ని బట్టి నాచన సోమన కాల నిర్ణయం చేశారు. ఉత్తర హరివంశ ప్రథమాశ్వాసంలో (1-26) 'రచిత సమకాల బాహువిక్రమముచేత' అనే పద్య పాదం ఉంది రచిత అంటే రచింపబడింది. సమ-2; కాల-6 బాహు-2, విక్రమ 1 అంటే 2621. ఎడమకు 1262. దీనికి సరియైనకాలం క్రీ॥శ॥ 1340. ఇట్టి గూఢకాలం రేనాటి చోళుల శాసనాల్లో ఉందని రెడ్డిగారు తెలియజేశారు.

పై ఆధారాల్నిబట్టి చూస్తే నాచన సోమన క్రీ॥శ॥ 1285 ప్రాంతంలో జన్మించి క్రీ॥శ॥ 1355 ప్రాంతం వరకు జీవించాడనీ, అతడు క్రీ॥శ॥ 1310-1340 వరకు గ్రంథకర్తగా ఉండి క్రీ॥శ॥ 1344 నాటికి చాలా గ్రంథాల్ని రచించి మహాకవివర్యుడుగా వినుతి కెక్కాడని చెప్పవచ్చు. అంటే సోమన ఎర్రన కంటె ప్రాచీనుడుకాడు సమకాలంవాడు కానీ కాస్త తరువాతివాడుకానీ కావచ్చు.

1.3. నాచనసోమన ఉత్తర హరివంశాన్నే గాక హరవిలాసం, వస విలాసం, ఆదిపురాణం, హరవిలాసం అనే గ్రంథాలు కూడా రచించినట్లు విమర్శ అభిప్రాయం. ఈ గ్రంథాల్లో ఉత్తర హరివంశం తప్ప తక్కిన గ్రంథాలేవీ లభ కావటంలేదు కానీ లాక్షణికులు సిద్ధ గ్రంథాల్లోవిగా పద్యాలను ఉదాహరించడం వాటిని సోమన కృతులుగా భావింపవలసి ఉంది.

### 1.3.1. ఉత్తర హరివంశం :

సోమన ఆశ్వాసాంత గద్యంలో "శ్రీమదుభయ కవిమిత్ర కొమ్మనామాత్య బుధారాధన విరాజి తిక్కన సోమయాజి ప్రణీతంబయిన శ్రీమహాభారత నంతరంబున శ్రీ మత్సకలభాషా భూషణ, సాహిత్య రసపోషణ సంవిధాన చక్ర సంపూర్ణకీర్తి నవీనగుణ సనాథ నాచన సోమనాథ ప్రణీతంబయిన యుత్తర వంశంబునందు" అని పేర్కొన్నాడు. ఈ మహాకవి పూర్వహరి వంశాన్ని చాడని కొందరు, ప్రబంధ దృష్టితో హరిహరాద్వైత ప్రతిపాదితమయ్యే కథ మాత్రమే తీసికొని ఉత్తర హరివంశం మాత్రం రచించాడని మరికొందరు భావిం అవతారికా భాగం లేకున్నా ఆశ్వాసాది పద్యం సుకవి స్తుత్యాత్మికమై దైవప్రా కలితమై కథాసూచకమై ఉండటం గమనింపదగింది. "హరివంశ ప్రథమ కథ రమునగల వింతలెల్లందప్పక మదిలోఁ డిరమయ్యెఁగదా" (1-3). "బలదేవులావృ విని మఱియుండఁసియదు" (1.4) మొదలయిన పద్యాలకు మూల శ్లోకాలుండటం సోమన పూర్వ హరివంశం రచించాడనడానికి ఆధారంలేదు. కాబట్టి ఈ మహ ఉత్తర హరివంశం మాత్రమే రచించాడనడం సమంజసం.

### 1.3.2. ఆదిపురాణం :

సుప్రసిద్ధ లాక్షణికుడయిన అప్పకవి తన అప్పకవీయ తృతీయాశ్వాస వికల్పయతికి ఉదాహరణంగా ఆదిపురాణంలోనిదిగా—

మ ఒకనాడిందు ధరుండు పార్వతియు లీలోద్యాన కేళీ సరి
న్నికటానేక వనప్రదేశముల దైతేయేంద్ర కన్యాప్సరో
నికురుంబంబులు పారిజాత కుసుమానీకంబుపైఁ జల్లద
ర్పక బాణంబులకెల్ల నెల్లయగు సౌభాగ్యంబు శోభిల్లగన్"3

3. అప్పకవీయ భావప్రకాశిక (అప్పకవీయ తృతీయాశ్వాసవళి ప్రాస పరి వివరణము) పుట - 90

అని పేర్కొన్నాడు. అప్పకవి కర్తపేరు తెలియజేయకుండా ఆదిపురాణమని చెప్పడ గమనింపదగింది. కానీ ఈ పద్యం కొద్దిమార్పుల్లో ఉత్తర హరివంశంలో చోటుచేసుకొంది. అందువల్ల ఉత్తర హరివంశానికి ఆదిపురాణమనే పేరుందా? రెండు కావ్యాల్లో ఒకే పద్యం ప్రయుక్తమా? అని వేలూరి శివరామశాస్త్రిగారు సందేహించారు. ఉత్తర హరివంశానికి ఆదిపురాణమనే పేరునట్లు ఎవ్వరూ పేర్కొనలేదు. కాబట్టి ఆదిపురాణమనేది ప్రత్యేక గ్రంథం కావచ్చు. కన్నడ సాహిత్యంలో ఆదిపురాణం ప్రసిద్ధం. ఆదితీర్థంకరుడయిన వృషభనాథుడు, అతని కుమారుడయిన భరత బహుబలి కథలిందున్నాయి ఇది పంపకవి కృతం. అష్టభాషా కవిత్వ విశారదుడయిన నాచనసోమన పంపకవి ఆదిపురాణం గ్రహించిగానీ లేక వేరొక గ్రంథమాధారంగా ఆదిపురాణం రచించి ఉండవచ్చు. అప్పకవి కాలం నాటికి తెలుగులో ఒక్కటే ఆది పురాణముండటంవల్ల కర్తపేరు చెప్పలేదని ఊహించవలసి ఉంది.

### 1.3.3. వసంత విలాసం :

అప్పకవి ముకారయతుల్ని గురించి చెప్తూ వసంత విలాసంలోదిగా –

కం. "అత్తఱి పిట నాగరకులు
చిత్తమున వసంతకేళి చిగురొత్తంగా
మొత్తములు గట్టి తెచ్చిరి
మొత్తపు షుల్లరుణితో బుఱట కొమ్ముల్"[4]

అనేపద్యాన్ని ఉదాహరణగా చెప్పారు. ఈపద్యాన్నే గ్రహించి కూచిమంచి తిమ్మకవి సర్వలక్షణ సారసంగ్రహంలో చక్కటి వడులకు ఉదాహరణంగా ఇచ్చాడు. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు ప్రబంధ రత్నావళిలో వసంత విలాసంలోదిగా "ప్రాలేపయతి సరసేనపజపెన్......హేమంత సామంతమై" అనే పద్యం పేర్కొన్నాడు. ఇలాగే చాటుపద్యమణిమంజరి రాజప్రశంసాస్తబకంలో "శ్రీ చన్నంగప కేవగ్రొమ్మెలుగులన్......గపి స్తోమైక చింతామణిన్" అనే పద్యం చేర్చారు. చాగంటి శేషయ్యగారు 'విలాశ చౌపదమ'నే పేరుతో సోమన పద్యంగా –

---

4. అప్పకవీయ భావప్రకాశిక (అప్పకవీయ తృతీయాశ్వాస వళిప్రాస పరిచ్ఛేద వివరణము) పుట – 54.

"వీణాగానము వెన్నెలతేట
రాణమీరఁగా రమణుల పాట
ప్రాణమైన పిన్నబ్రాహ్మణుపీట
జాణలు మెత్తురు జాజుల పాట"

అనేదాన్ని పేర్కొన్నారు. మాచయ బ్రహ్మధీమణిని గురించిన ఇంకొక కూడా కనిపిస్తూఉంది. "కమలంబునకు పుట్టి కమలంబు చుట్టమై కమలంబు త కాంచిగాక" అనే చాటు పద్యమణి మంజరి (రాజప్రశంసాస్తబకం) లోని వసంత విలాసంలోది గావచ్చు. ఈ ఆధారాల్ని బట్టి వసంత విలాసంకూడా కృతి అని స్పష్టమవుతూఉంది.

### 1.3.4 హరివిలాసం:

ఓగిరాల జగన్నాథకవిగారు సుమనోభిరంజన కావ్య వ్యాఖ్యానంలో " దఘ్న హ్రదమున నుఱికెన్" అనే పద్యపాదాన్ని ఉదహరించారు. ఈ మాధారంగా సోమన పూర్వహరివంశాన్ని రచించాడని నడకుదుటి వీరరాజు భావించారు. కానీ కాళీయ హ్రదం చొరబారడానికి వీలులేని అగాధం వల్లను యాది సర్పనివాసం చేతనూ భయంకరమయింది. పై పద్యానికి మూలమ హరివంశంలో విసిపత్కహ్రదే ఘోరే" అని ఉండటం వల్ల సోమన శ్రీకృష్ణ వర్ణించే హరివిలాసమనే కావ్యమొకదాన్ని రచించి ఆపై రసవత్తరాలయిన క ఉత్తర హరివంశాన్ని రచించి ఉండవచ్చునని డా॥ (శ్రీమతి) యశోదా రెడ్డిగారభి పడ్డారు. ఇలాగే ప్రబంధమణి భూషణంలోని "పురుడు వచ్చిననాడ మోతన స్తన్యజీవితములు చవులు చూచె" అనే పద్యం హరివిలాసంలోది మూలహరివంశంలో ఈపద్యానికి మూలమనదగ్గ శ్లోకం కనిపించదు. కథ కూడా అతకడం లేదు. అంటే అక్రూరుడు బలరామ కృష్ణుల్ని మధురకు వచ్చేనాటికి కృష్ణుడింకా పాంచాలి మాన సంరక్షణం చేయలేదనడం స్పష్టం. పైపద్యంలో పాంచాలి మానసంరక్షణ చేయబడినట్టుంచి. కాబట్టి సోమన హ మనే పేరుతో ఒక గ్రంథాన్ని రచించి ఉండవచ్చునని చెప్పవచ్చు.

1.3.5 హరవిలాసం :

కస్తూరిరంగకవి ఆనందరంగరాట్ఛందంలో ఆయా లక్షణాలకు లక్ష్యాలుగా సోముని హరి విలాసం నుండి నాలుగు పద్యాలు ఉదహరించాడు.

కం. జయ విజయ వినుత జన్యా
వ్యయ దూరానందరూప భాసురదత్తా
భయ హరి హర ముఖ నిర్జర
నయవన్నక్షత్ర యూధ నళినీనాథా! 5

కం. శంబరవైరి విభంజన
సాంబశివాయంధక ప్రశాసకగజచ
ర్మాంబరధర యని నీదు ప
దంబులు పూజించువాడు ధన్యుడు సుమ్మీ"6

కం. జయ మగుటకు నీమది స
మ్మయమేటికి వినుమనుచు సమంచిత కరుణా
లయుఁడగు మునీంద్రుడెంతయు
ప్రియముగ మంతంబు జెప్పె నృపతికి నెలమిన్"7

కం. మౌనితిలక! సజ్జన సం
తాన మహీరుహ! భవత్సుధాలాపము నా
వీనులకు విందొనర్చెన్
మేనునఁగల తాపమణచె మృషగాదు సుమీ."8

ఈ పద్యాల్ని పరిశీలిస్తే అవి హర సంబంధాలుగా కనిపిస్తున్నాయి. ఛందం కందం కావడం గుర్తించదగి ఉంది. ఈ పద్యాలు వరుసగా ఉన్నాయో లేక ఉదా

---

5. ఆనందరంగరాట్ఛందము—అపి అను ఉపసర్గ పుట-115
6. ఆనందరంగరాట్ఛందము - ప్రాదియతి - పుట - 100
7. ,, - ముకారయతి - పుట - 98
8. ,, - హల్లులు - పుట - 117

2) 

హరణ కోసం ఆయా భాగాలనుండి ఏర్చికూర్చి పెట్టినవో తెలియదు. ఉత్తర వంశానికి పూర్వం ఈ గ్రంథాన్ని సోమన రచించి ఉండవచ్చు. కస్తూరి రం హరవిలాసము హరవిలాస మనకా కి బహుళ హరివిలాసము పేర్కొని ఉండవ

లభించిన ఉపపత్తుల్ని బట్టి ఉత్తర హరివంశం. వసంతవిలాసం, హరివిలా ఆదిపురాణం, హరవిలాసం సోమన రచనలని తెలుస్తూ ఉంది.

1.4. సోమన ఆశ్వాసాంత గద్యలో "ఇది శ్రీమదుభయ కవిమిత్ర కొమ మాత్యపుత్ర బుధారాధన విరాజి తిక్కన సోమయాజి ప్రణీతంబైన శ్రీ మహాభ కథానంతరంబున శ్రీమత్సకల భాషాభూషణ సాహిత్య రసపోషణ సంవిధాన చ సంపూర్ణకీర్తి నవీనగుణసనాథ నాచనసోమనాథ ప్రణీతంబైన యుత్తర హరివంశం అని పేర్కొన్నాడు. దీనిని బట్టి నాచనసోముని బిరుదులుగా చెప్పుకోదగ్గవి నాల అవి సకల భాషాభూషణ, సాహిత్య రసపోషణ, సంవిధాన చక్రవర్తి, నవీన సనాథుడు. వీటిని గురించి కొంత పరిశీలించడం ఆవశ్యకం. సకల భాషాభూ బిరుదాన్ని గురించి ఆలోచిస్తే సోమనాథుడు పలుభాష లెరిగినవాడని తెలుస్తు సోమనాథుడెరిగిన ఆంధ్రేతర భాషలను గురించి అతని రచనలోగానీ ఇతర రచనల్లోగానీ కనిపించడంలేదు కాబట్టి సకల భాషాభూషణ బిరుదాన్ని గురి నిర్ధారించి చెప్పడం సాహసమే అవుతుంది.

## 1.4.1 సాహిత్య రసపోషణం :

ఈ సాహిత్యరసపోషణాన్ని గురించి పలువురు పలురకాలుగా నిర్వచించా "సాహిత్యము యొక్కయు, రసము యొక్కయు పోషణము సాహిత్య రసపోషణ సహితముల భావము సాహిత్యము. సహితమన తత్కాలమందు అనిష్టమై అనం కాలమునందు ఇష్టాపత్తి హేతువు. అనగా పారలౌకిక విషయము. వేద వేదాంగ లందలి పరమార్థములే పారలౌకిక విషయములగును. తత్ప్రతి పాదకము సాహి మగ" విశ్వనాథ సత్యనారాయణగారు పేర్కొన్నారు.

సహితం భావం సాహిత్యం. సహితమంటే కూడుకొని ఉండనే సామా న్యార్థాన్ని అనుసరించి సర్వశాస్త్రార్థాలతో, సర్వకళలతో నిండిందనే చెప్పవచ్చు.

పలువురి నిర్వచనాలు పరిశీలిస్తే సాహిత్య శబ్దానికి రెండు ప్రత్యేకనిర్వచనాలు వ్యక్తమవుతున్నాయి. 1. శబ్దార్థాల సత్సంబంధంవల్ల ఏర్పడే శోభావిశేషం. 2 అష్టాదశ విద్యల కలయిక, తర్క వ్యాకరణ మీమాంసాదుల సంగతి. ఈరెండు విషయాలూ సుసంగతాలయి నాచనసోముని సాహిత్యరసపోషణుడనే బిరుదంలో పొసగుతున్నాయి. కాబట్టి సోమన సాహిత్య రసశబ్దాన్ని ఒక విశిష్టార్థంలో ఉపయోగించినట్లు తెలుస్తూ ఉంది. ఈతడీ సాహిత్య శబ్దాన్ని కేవలం వాఙ్మయ రూపార్థంలో గానీ, అన్వయ జ్ఞాన రూపార్థంలోగానీ, లేక శబ్దార్థాల యథాతథ సహభావాన్ని అర్థంలోగానీ స్వీకరింపక భోజకుంతకాదుల ననుసరించి లోకోత్తర చమత్కార జనకమగు శబ్దార్థాల విచిత్ర విన్యాసమని భావించినట్టు వ్యక్తమవుతూ ఉందని డా॥(శ్రీమతి) యశోదారెడ్డిగారభిప్రాయపడ్డారు.



భరతుడు "నహిరసాదృతే కశ్చిదర్థః ప్రవర్తతే" అని తన నాట్యశాస్త్రంలో రసప్రాధాన్యాన్ని ప్రశంసించాడు. విభావానుభావ సాత్త్విక వ్యభిచారాదులతో పుష్టి పొందిన స్థాయీభావం రసమై సహృదయ హృదయ రంజనం చేస్తుంది ఈ రసాన్నే ఆలంకారికులు కావ్యానికి ప్రాణం వంటి దన్నారు. సోమన నాట్యరసాన్నే సాహిత్య రసమన్నాడు. తిక్కన కావ్యరసమన్నాడు. సాహిత్య కావ్యాలకు సూక్ష్మ భేదమున్నా రెంటికీ అర్థం ఒకటే.

నాచన సోమన సాహిత్య రసపోషణ అనేపదాన్ని ప్రయోగించి దానిద్వారా శబ్దార్థతుల్య ప్రాధాన్యాన్ని ఉగ్గడించి కావ్యశరీరం శబ్దమొక్కటేగాక శబ్దార్థ యుగళమని సూచించాడు. సాహిత్య పదం కావ్య పరంగా తరతరాలనుండి వాడబడుతూ ఉంది. కాబట్టి కావ్యమంటే శబ్దార్థయుగళమనీ ఆ శబ్దార్థాలు రెండూ తుల్య ప్రాధాన్యంతో విచిత్రంగా పొసగి రసవంతాలై ఉండాలనీ కావ్య నిర్వచనం చేసినట్టుగా సాహిత్యరసపోషణ అనే దాన్ని ప్రత్యేకించి సోమనప్రయోగించాడు. ఈతడు ఉత్తరహరి వంశంలో ఆశ్వాద్య మానాలు, ఆకర్షకాలు అయిన శాబ్దార్థల చేత, తద్గతరాలయిన కవి ప్రౌఢవ్యాపారాలచేత శబ్దార్థపాకాల రెంటినీ గరిష్ఠ స్థాయిలో పరిణతిని పొందించి సాహిత్య రసపోషణం చేసాడు. ఇదే అద్భుత మయిన ఈతని శైలి అయింది.

ఊర్వశీనరక సంవాద ఘట్టంలో నరకుడు యాగభాగాలిందని మునుల్ని బాధించినప్పుడు —

"మనుజాసనులట, బలులట,

మునులట, యాగంబులట. నమోవిశ్వస్మైజే"9 అనే ఈ పద్యంలో భా శబ్ద సౌందర్యాలు రెండూ కవిప్రౌఢిని కనబరుస్తున్నాయి. సోమన పద్యాల్లో శబ్దార్థా రెండూ పరస్పర శోభాకరాలై నడచాయి. ఉదాహరణకు "చతుర వచో విలాసః గు సాగర : సాగర మేఖలావనీ" (1-66) అనే పద్యాన్ని స్వీకరించవచ్చు. "ఎక్క వాడవన్న కడునీరవుఁగాఁ బడవిం జరించదీ" (2-132) మొదలయిన పద్యాల్ సుకుమార పదభావాల కూర్పు కనిపిస్తూ ఉంది "తంద్రిఁగను గొనవెఱచి సౌధం లోన, మఱుగుపడు నింతిపతిఁజూడ మఱియు వెడలు" (5-244) అనే పద్యం భావానుగుణమయిన చేష్టావర్ణనం వ్యక్తమవుతూ ఉంది. "చె॰ లు బొమ్మల పెం చేయుచో లజ్జింతుమగనికై యేనేల మరులుకొంటి" (5-115) అనేలో పద్యం పా మనోభావ చిత్రణ ఉంది.

సోమన ఆయా పాత్రలకు తగినట్టు ప్రౌఢగతుల సంభాషణాదుల్ని చొప్పిం తన నాటకీయతను ప్రదర్శించి సహజత నాపాదించాడు. "కలిగెనొక జాంబవ వెన్నెల వడఁబడెడేల వలపు నీతుల వెగెన్" (3-115) అనే పద్యమిందుకు ఉ హరణ.

ఉత్తర హరివంశంలో ధీరోదాత్తుడయిన శ్రీకృష్ణుడు నాయకుడు. అంగిరస వీరం. అంగరసాలు శృంగారాదులు, కానీ రసప్రాధాన్యాన్ని గురించి చెప్పవల వస్తే వీరశృంగారాలు రెంటినీ సమప్రాధాన్యంతో సోమన పోషించాడని చెప్పవచ్చు శృంగార వీరాదులు సహజంగా సహృదయులకు ఆనందం కలిగిస్తాయి. కా సోమన ఇతర రసాల్ని సయితం అత్యంత అభినివేశంతో సర్వాంగ సుందరం వర్ణించాడు. ఇదే సాహిత్య రసపోషణమని విమర్శకుల అభిప్రాయం. సోమ వీరసాన్నైనా అత్యంతాభినివేశంతో సర్వాంగ సుందరంగా వర్ణించి సహృదయు కానందాన్ని కలిగిస్తూ 'సాహిత్యరసపోషణుడ'నే బిరుదాన్ని సార్థకం చేసుకొన్నా

---

9. ఉత్తర హరివంశము 1-94.

1.4.2. సంవిధాన చక్రవర్తి :

విధానమంటే చేయడం, తీరు, ఆజ్ఞ, పూజ, ఉపాయాలనే అర్థాలున్నాయి సంవిధాన మనడం వల్ల బాగా కూర్చడం అనే అభిప్రాయ మేర్పడుతూ ఉంది. భవభూతి మహాకవి నాటకాదుల్లో విచిత్ర సంఘటన మేర్పనప్పుడు "అహో సంవిధానకమ్" అని ప్రయోగించాడు. నాచనసోమనకూడ ఉత్తర హరివంశంలో కథాభాగాల సంవిధాన శబ్దాన్ని ప్రయోగించాడు. "...నాచేసిన సంవిధానంబున నీవు నిశ్చింతంబుగా ననిరుద్ధుం గొనిపొమ్ము" (6-184)

1.4.2.1. కథాసంవిధానం :

మూలహరివంశంలో కథలనేకం ఉండగా ప్రధానాలయిన ఆరు కథల్ని మాత్రమే గ్రహించడంలో సోమన కథాసంవిధానవైచిత్రి కనిపిస్తుంది. పారిజాతాపహరణ వృత్తాంతం రమణీయమయినా కృష్ణలీలా వినోదానికి తగదని సోమన పరిత్యజించాడు. ప్రద్యుమ్నుని కథ రసవత్తరమయినా కృష్ణ ప్రాధాన్యం గాకపోవడంవల్ల వదలి పెట్టాడు గ్రహించిన కథల్లో ఉత్తరోత్తర ప్రాముఖ్యాన్ని కల్పించడం సోమన సంవిధానమవుతుంది. ఖగోళాధిపత్యాన్ని కల్పించడం నరకాసురుని కథవల్ల కలిగిన ప్రయోజనం. బ్రాహ్మణ బాలకుని రక్షించడంవల్ల మృత్యువును శాసించే అధికారం సంక్రమించిందనడం ఘంటాకర్ణాదుల్ని అనుగ్రహించడం వల్ల యథేచ్ఛగా పదవులనిచ్చే సార్వభౌమత్వాన్ని ప్రతిపాదించడం పౌండ్రకాది వధాదుల వల్ల దుష్టజన శిక్షకత్వం నిరూపించడం. పుత్రార్థం తపస్సు చేయడం హరిహరాభేదాన్ని ప్రస్ఫుటం చేయడమే. ఇట్టి సత్యాల కనుగుణమయిన కథల్ని మాత్రం సోమన గ్రహించడం ఆతని కథా సంవిధానం. మూల హరివంశంలో అనేక ఉపాఖ్యానాలున్నా సంవిధాన దృష్ట్యా సోమన ఇందుధరోపాఖ్యానం, హంసడిభకోపాఖ్యానం మొదలయిన వాటిని మాత్రమే స్వీకరించాడు.

1.4.2.2. సంఘటనా సంవిధానం :

మూలహరివంశంలో మొదట అనిరుద్ధుని వివాహం వర్ణింపబడింది ఆతరువాత రుక్మిణి కృష్ణునిచూచి తనకు ఒక కుమారుని దయచేయుమని కోరినట్లుగా వర్ణింప

జరిగింది. అనిరుద్ధుని తండ్రి ప్రద్యుమ్నుడు. మనుమని వివాహంచెప్పి తండ్రి జననానికి కారణభూతమయిన కథను ఆపై చెప్పడం అసంగతం. కాబట్టి సోమన అనిరుద్ధ వివాహాత్పూర్వమే ద్వితీయాశ్వాసంలో రుక్మిణి కృష్ణుని పుత్రునిమ్మని కోరడాన్ని వర్ణించాడు. మృతశిశు పునరుజ్జీవన వృత్తాంతానంతరం పుత్రదర్శనలాలస రూపమయిన కథను జోడించడం సోమన సంఘటనా సంవిధానం.

మూలంలో నరకాసుర సంహారార్థం సత్యభామ వెళ్ళినట్టుంది. కానీ యుద్ధం చేసినట్టులేదు. ఎఱ్ఱన సత్యభామ యుద్ధాన్ని సంగ్రహంగా వర్ణించాడు. కృష్ణుడు తన అలసటను తెలియజేసి సత్యభామకు ధనస్సు నందిస్తాడు. ఇక్కడ సోమనాథుడు "నీవు సమరంబెకోరుదు" అంటూ ధనస్సు నిచ్చినట్టు వర్ణించాడు. నరకుడు భూదేవి పుత్రుడు. సత్యభామ భూమాత, కుమారుడు తండ్రిమీద బాణాల్ని ప్రయోగించగా తండ్రి సొమ్మసిల్లాడు. కుమార రక్షణంకంటె భర్త రక్షణమవసరం. కాబట్టి సత్యభామ ధనస్సు చేపట్టి యుద్ధం చేయడం సమంజసం. పౌండ్రక వధానంతరం కృష్ణుడు దేవేరులతో నెత్తమాడటం సోమన సంఘటనా సంవిధానానికి ప్రబల నిదర్శనం. ఉషావృత్తాంతాన్ని చివర చెప్పడంవల్ల కావ్యం మంగళాంతమైంది.

ఈ విధంగానే సోమన సంభాషణ, రస, పాత్రపోషణ, వర్ణనలు, మొదలయిన వాటిలో సయితం తన అసమాన సంవిధాన చాతురిని ప్రదర్శించి పాఠకుల్ని అలరింప జేశాడు.

### 1.4.3. నవీన గుణాలు :

సోమనకుగల బిరుదాల్లో పేర్కొనదగింది నవీనగుణ సనాథుడు. ఈ నవీన గుణాల్ని గూర్చి పండితుల్లో భిన్నాభిప్రాయాలున్నాయి. ఈగుణాలు వ్యక్తికిగాక రచించిన కావ్యానికి సంబంధించినవని చెప్పవలసి ఉంది. సోమన కవితాధారలో అతనికంటె ప్రాచీనుల్లో అంతగా వ్యాప్తికి రాని గుణాలు గోచరిస్తున్నాయి. అవే నవీన గుణాలని రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారు భావించారు.

సోమన పూర్వకవులందరూ దాదాపు ప్రాచీన పద్ధతినే అవలంబించారు. సోమన మాత్రం కొంత భిన్నత్వాన్ని ప్రదర్శించి నవీన గుణ సనాథుడనిపించుకొన్నాడు.

నాచనసోమన భక్తితత్త్వం

ఆంధ్ర సాహిత్యంలో ప్రబలిన నవీన శబ్దార్థ రచనా పద్ధతికి ఆద్యుడు సోమనే సోమన చక్కని వస్తుకళను ప్రదర్శించాడు వస్తువుల్ని సర్వాంగ సుందరంగా, స్వాభావికంగా వర్ణించి మనోనయన గోచరంచేశాడు. ఉదాహరణకు పిశాచద్వయవర్ణన, కోటలగ్గ పట్టడం, గదాయుద్ధం, జూదం మొదలయినవి.

మనోజ్ఞమయిన శబ్దార్థ రచనా కళ ప్రాచీనుల్లో ఉన్నా సోమన దాన్ని కొంత విస్తరించడానికి ప్రయత్నించాడు. ఒక అర్థాన్ని తెలిపేందుకు ఎన్ని పదాలు ప్రయోగింపవచ్చో అన్నిటినీ ప్రయోగించాడు. ఉదా॥ "వడఁకు పన్నగరాజు పడగల మీద సర్వం సహా కాంత పేరణము సూప" [4-216].

అర్థంలో వలె శబ్దంలోనూ సోమన వైవిధ్యాన్ని పాటించడం ఒక నవీనగుణ మవుతుంది ఉదా॥ హంసహలధరుల గదాయుద్ధం. "ఇట్లు గదా విహారంబున హంసహలధరులు రుధిరధారా సారంబునం దడసి వడిసెడక వాఁటపక యోసరిలక యోలంబు గొనక............గదలు సారించియు. సైరించియుం జుట్టియుం గట్టియుఁ గదల్చియు నదల్చియు దాకించియు..." (4-248)

చెప్పవలసిన మాటల్ని సాధ్యమైనంతవరకు చమత్కారంగా చెప్పడంలో కూడా సోమన ఎంతో నైపుణ్యాన్ని ప్రదర్శించాడు. అనిరుద్ధుని వలచి విరహ వేదనలో ఉన్న ఉషాకన్య చెలికత్తెతో "సిగ్గు చిత్తమునన్ వాదులు పెట్టుకొన్నయవి" అని చెప్పుకొంది. ఒకవైపు సిగ్గు, ఇంకొకవైపు ఆశ బాధిస్తుందనడం సహజోక్తి. అదే మాటను మరొకచోట "తలఁపునకు జిక్కనుండెడి తలఁపు లేదు

లజ్జఁబోఁద్రోవ లజ్జకు లజ్జలేదు" (5-115) అని సోమన వర్ణించాడు.

సోమన శబ్దరచనలో సిద్ధహస్తుడు. అనుప్రాసాలు, అంత్యప్రాసాలు సోమనకు అందుకొనేట్లు దొరుకుతాయి. ఒక్కొక్క చోట యమకం ఉన్నది ఉన్నట్టుగా వచ్చి చోటు చేసుకొంటుంది. పద్యంలోనూ, గద్యంలోనూ ఏకనాదంగల పదాల్ని కూర్చి గజ్జెల గంటల గొలుసుల్లా సోమన రచన సాగించాడు. ఉదా॥ "ద్విరదంబులు నదదంబులు, హరులు నరులు సిక్కు నుక్కు నలవున్నెలవున్"." (6-51) "చని

వని కాంచెనంత ఋషిసంహతి సారసకేసరాంతరాసస" (1-106) అనే పద్యంలో నిరోష్ఠ్య రచన పాటింపబడింది

"సాహిత్య రసపోషణము, నవీనగుణసనాథలక్షణము రెండును సోమనలో కలిసి ఉండును. కవిత్రయము యొక్క పద్యరచనకు ఇతని పద్యరచనకు గలభేదము ననుసరించి నవీన గుణముల నిర్ధారింపదగునని" విశ్వనాథ సత్యనారాయణగారు విపులీకరించారు.

సీసపద్యాన్ని రచించడంలో సోమన నూతన మార్గాన్ని అవలంబించాడు. ఉదా॥ "ఉత్పాత లూగెడు నుదయాస్తగిరులతో నాకాశలక్ష్మి కోలాటమాడ "(4-216) ప్రబంధ కవులందరూ సోమన మార్గాన్నవలంబించారు. హృదయంగమాలు, గడుసుదనం గల పలుకు బళ్ళను ప్రయోగించడంలో సోమన అందెవేసిన చేయి. ఉదా॥ శిరసుండగ మోకాలను సేసలువెట్టుట, మిరియాలుంజొన్నల సరిపోవే.

డా॥ (శ్రీమతి) యశోదా రెడ్డిగారు సోముని రచనలో కనిపించే నవీనగుణాన్ని ఈ క్రింది విధంగా పేర్కొన్నారు. "శ్రీ సర్వమంగళా" అనే కందపద్య దైవస్తుతిని, కవిస్తుతిని, వస్తునిర్దేశాన్ని చేస్తూ ఉంది. శ్రీశబ్దంతో లక్ష్మి సరస్వతుల నుతింపబడ్డారు. వ్యాసమహర్షి ప్రస్తుతింపబడ్డారు. తానువర్ణించబోయే క నారాయణ కథ అని అతడు వ్యాసమనోనివాసి అని కథాసూచనం చేయబడింది కాళిదాసాదులు గ్రంథావతరణ ప్రసంగాలు చేయకపోవడం బట్టి సోమనే ఆ సంప్రద యాన్ని తెలుగులో ప్ర ప్రథమంగా ప్రవేశపెట్టాడనిపిస్తూ ఉంది. ఇదొక నవీ గుణంగా లెక్కింపవచ్చు.

సోమన హరివంశంలో ఉన్న కథల్ని పరిశీలించి విశిష్టాలు, ప్రధానర పోషకాలు అయిన కథల్ని మాత్రమే ఏర్చికూర్చాడు. ఇందులో ఒక నవ్యత క పిస్తుంది. పాండిత్యానికి గౌరవమేర్పడుతున్న కాలం నాటివాడు సోమన. ఇత వివిధ విషయాల్ని క్రోడీకరించడమే గాక వాటిని సాంగంగా వర్ణించడం ఆవా నవ్యత. ఉదా॥ వేటసాధనాలు – దీమములు, జోడెంపు వలలు మొ॥. మల్లయుద్ధం రెంజవట్టుట, కడవరానకుజొచ్చుట ఖడ్గయుద్ధం – భ్రాంతము, విభ్రాంతము. ప వృత్తులతో పరిచయం – వసంతమాడెడు వారుంబోలె చిమ్ముట, జూదరులవోలె దం

మరువకుండుట సైకంపు బైదలి మూక (చక్కని స్త్రీల సమూహాలు) రాగవాగలు (పాముపంటి వగ్గాలు) వంటి విచిత్ర పదప్రయోగాలు సోమన రచనలో చోటు చేసుకొన్నాయి.

సోపపత్తికంగా పైపండితులు వెలిబుచ్చిన అభిప్రాయాల ప్రకారం సోమన కావ్యంలో అంతటా పెక్కు నవీనగుణాలు కనిపిస్తున్నాయి. కాబట్టి నాచన సోమనకు నవీన గుణసనాథుడనే బిరుదం ఎంతైనా తగి ఉంది.

## 1. 5. అనువాద దృష్టి :

నాచనసోమన ఉత్తర హరివంశంలో ఆశ్వాసాంత గద్యలో "శ్రీమదుభయకవిమిత్ర కొమ్మనామాత్య పుత్ర బుధారాధన విరాజి తిక్కన సోమయాజి ప్రణీతంబైన శ్రీమహాభారత కథానంతరంబున" అని పేర్కొనడాన్ని బట్టి అనువాద విధానంలో తిక్కన పద్ధతి ననుసరించాడని గ్రహింపవచ్చు. ప్రధానసన్నివేశాల్లో, ఆ కథనంలో మూలానికనుగుణంగా రచించడం, కొన్నిచోట్ల రసదృష్టితో విపులీకరించడం మరి కొన్ని చోట్ల ఔచిత్యపోషణానికై మూలాన్ని ఒకింత మార్పుచేసి మెరుగుపెట్టడం అనే పద్ధతుల్ని సోమన పాటించాడని చెప్పవచ్చు. అంతేగాక కథాకథనంలో సోమన వినూత్న పద్ధతి నవలంబించి కవిత్రయం కంటె కూడా భిన్నమార్గంలో రచన చేశాడని చెప్పవలసి ఉంది.

మూల హరివంశ విష్ణుపర్వంలో 61వ అధ్యాయం నుండి ప్రారంభింపబడిన ఈ హరివంశ ఉత్తరభాగం భవిష్య పర్వాంతం 55వ అధ్యాయంతో సమాప్తమవుతూ ఉంది. ఈ భాగంలో సృష్టి ప్రళయ క్రమాలు, క్షేత్ర నదీనద మాహాత్మ్యాలు, దాన ధర్మ ప్రసంగాలు, యుగధర్మాలు, పారిజాతాపహరణ, వజ్రనాభ వృత్తాంతాలు, నికుంభసంహారాదులు ఉన్నాయి. కథాసంవిధానాన్ని అనుసరించి సోమన రసపోషణా దృష్టితో సృష్టిప్రళయాది విషయాల్ని విడిచిపెట్టాడు. నరకాసుర సంహారం, మృత శిశుపునరుజ్జీవనం, పిశాచద్వయవృత్తాంతం, పౌండ్రకవధ, హంసడిభకోపాఖ్యానం, బాణాసుర వృత్తాంతం అనే ఆరు కథలను మాత్రమే గ్రహించాడు.

# 2. ఉత్తర హరివంశ కథలు

2.0 సుప్రసిద్ధ సంస్కృత గ్రంథాల్లో హరివంశం కూడా పేర్కొనదగిం దీన్ని వేదవ్యాస మహర్షి రచించాడు. మహాభారత రచనానంతరమే హరివంశ రచ సాగినట్టు అభివ్యక్త మవుతూఉంది. భారతంలో సద్విషయాల్నేగాక అసద్విషయా కూడా ప్రస్తావించవలసివచ్చింది. అందువల్ల తనకు కాలుష్య మంటుకొన్న వ్యాసుడు భావించాడు. దాని నివారణ కోసమే హరివంశ రచనకు పూనుకొన్న అతడే తెలిపాడు.

"అసత్ప్రబంధ కాంతార పరివర్తన పాంసు లామ్ ।
వాచం శౌరి కథాలాప గంగ యైవ పునీమహే॥"[1]

వ్యాసుడు చేసిన శౌరి కథాలాపం ఆంధ్రకవుల కత్యంత ప్రీతిపాత్రమయిం అందుకే వారు హరివంశరచనకు పూనుకొన్నారు. కవిత్రయంలో ఒకడయిన ఎఱ తొలి తెలుగు హరివంశకర్త అని చెప్పవచ్చు. ఈ గ్రంథంలో హరివంశం పూర్వోత్త భాగాలుగా విభజింపబడింది. పూర్వభాగంలో తొమ్మిది ఆశ్వాసాలు, ఉత్తరభాగం పది ఆశ్వాసాలు ఉన్నాయి. ఇది సంస్కృత హరివంశానికి సమగ్రానువాదమ చెప్పడం సాహసం కాదు.

ఎఱ్రనకు కొంత తరువాతివాడయిన నాచనసోమన కూడా హరివంశ రచ చేశాడు. ఇది ఉత్తర హరివంశమనే పేరుతో ప్రసిద్ధికెక్కింది. ఇందులో ఆరు ఆశ్వా లున్నాయి. హరివంశంలో తనకు నచ్చిన కొన్ని కథలను మాత్రమే తీసికొని నాచ సోమన తన గ్రంథాన్ని మృదు మధుర కావ్యంగా తీర్చి దిద్దాడు. ఈ కావ్యాని కూడా ఇతడు భారత రచనా పరిసమాప్త్యనంతరం రాయడం చెప్పుకోదగ్గ విశేష "ఇది శ్రీమదుభయకవి మిత్ర కొమ్మనామాత్య పుత్ర బుధారాధన విరాజి తిక్క సోమయాజి ప్రణీతంబైన శ్రీమహాభారత కథానంతరంబున శ్రీ మత్సకల భాషాభూష సాహిత్య రసపోషణ సంవిధాన చక్రవర్తి సంపూర్ణ కీర్తి నవీనగుణ సనాథ నాచ సోమనాథ ప్రణీతంబైన యుత్తర హరివంశంబు" అని సోమన ఆశ్వాసాంత గద్య ప్రస్తావించాడు.

సంస్కృత హరివంశం హరివంశ, విష్ణు, భవిష్య పర్వాలుగా విభక్తమైఉం ఎఱ్రన దీన్నే పూర్వోత్తర భాగాలుగా విభజించి రాశాడు. నాచన సోమన ఉత్త

1. తెలుగులో హరివంశములు. పుట – 81

భాగంలోని కొన్ని కథల్ని మాత్రమే తీసికొని ఉత్తర హరివంశమనే పేరుతో ప్రసిద్ధ కావ్యంగా వెలయించాడు. ఈ హరి వంశంలోని కథలు కొన్నిటిని తమ తమ అభిరుచుల కనుగుణంగా తీసికొని స్వకపోల కల్పనలతో ఎందరెందరో తెలుగు రచయితలు స్వంత గ్రంథాలుగా వెలయించారు. వీటిని గురించి పరిశోధన సాగించి డా॥(శ్రీమతి) యశోదారెడ్డిగారు 'తెలుగులో హరివంశములు' అనే శీర్షికతో చక్కని సిద్ధాంత గ్రంథాన్ని సంతరించారు.

ఏ రచయిత వ్యక్తిత్వాన్నిగానీ, తత్త్వాన్ని గానీ తెలుసుకునేందుకు అతని రచనలే ఆధారం. ఉత్తర హరివంశ కర్తలో ఉద్బుద్ధమయిన భక్తితత్త్వాన్ని గురించి తెలుసుకునేందుకు ఆయన రచనల్ని పరిశీలించడం ఆత్యావశ్యకం. ఆయన ఉత్తర హరివంశం, ఆదిపురాణం, వసంతవిలాసం, హరివిలాసం,హరవిలాసం అనే గ్రంథాల్ని రచించినట్టు చెబుతారు. వాటిలో ఉత్తర హరివంశం మాత్రమే నేటికీ అందుబాటులో ఉన్న గ్రంథం. తక్కినవి కాలగర్భంలో కలసినట్టు తెలుస్తుంది. నాచన సోమన భక్తి తత్త్వాన్ని తెలుసుకునేందుకు అతని ఉత్తర హరి వంశాన్ని పరిశీలిస్తేనేచాలు. దీన్ని పరిశీలించేటప్పుడు ఇందులోఏయే అంశాలు ఉన్నాయో కూడా తెలుసుకోవడం చాలా అవసరం. నరకాసుర సంహారం, విప్రకుమార రక్షణం, ఘంటాకర్ణుని వృత్తాంతం, పౌండ్రక వధ, హంసడిభకోపాఖ్యానం, బాణాసుర గర్వభంగం అనే ఆరు కథలు ఈ కావ్యంలో చోటు చేసుకొని ఉన్నాయి. వీటిని గురించి తెలుసుకోవడం ఆసక్తి కరంగా ఉంటుంది.

## 2.1. నరకాసుర సంహారం :

బ్రహ్మచేత వరాలు బడసిన నరకాసురుడు జైత్రయాత్రకై స్వర్గం మీదిక్కి దండెత్తాడు. దేవేంద్రుని మందిర కవాటాన్ని తన ఇంటి కొప్పుతో పొడిచాడు. క్రూర సింహ నాదుడయి సమరాన్ని గానీ అందుకు సామర్థ్యం లేకుంటే జయాన్ని గానీ ఇమ్మని కోరాడు. దేవేంద్రుడు ఐరావతాన్నధిరోహించి ససైన్యంగా సంగ్రామానికి సిద్ధమయ్యాడు.

ఉభయ సైన్యాలూ అసికుఠార కుంత తోమర క్షురికాది ఆయుధాలతో సమరం సాగించాయి. దానవుల ధాటికి తట్టుకోలేక దేవతల బలం వెనుదీయ సాగింది. రాక్ష

సులు ఉత్సాహంతో ఉప్పొంగారు. ఇంద్రుడది చూచి 'సిలుసిలుమ'ని దేవతః పురికొల్పి దానవుల మీదికి విజృంభించాడు. యమ కుబేర వరుణులు అతనికి స యంగా వచ్చారు. మురహయగ్రీవ నిశుంభులు నరకుని వైపున పోరాటానికి : మయ్యారు. ఇరుపక్షాల వారికి భీకరయుద్ధం జరిగింది.

రాక్షసుల ప్రచండ ప్రతాపానికోర్వజాలక వరుణ యమకుబేరులు తమః నెలవులకు మరలారు. ఇంద్రుడొకడే పోరి నరకుని చేత పరాజితుడయ్యాడు. దే లందర్నీ జయించిన నరకాసురుడు వైరిసంపదలు పొంది అమరావతిలో అడ పెట్టాడు. ఆనగరం భీభత్సమయి కళాకాంతులు నశించింది. దైత్యులు అమరాంగన చెరబట్టడం, వారి హర్మ్యాల్లో అందమైన భాగాల్ని పెకలించడం, వారి సంపద కొల్లగొట్టడం వంటి అకృత్యాలు చేశారు. నరకుడు జంభారి మందిరాన్ని ప్రవేశి రత్నఖచిత సింహాసనాన్ని అధిష్టించాడు. అంతఃపుర కాంతలప్పటికే వైదొలగ గంధర్వ గానంతో వినోదిస్తూ ఊర్వశిని తీసుకరమ్మని దానవ భటుల్ని పంపా వారు ఊర్వశిని కలుసుకొని తమ యేలిక ఆనతిని తెలియపరచారు. గత్యంతరం ఊర్వశి దైత్యేంద్రుని సమీపించి అతని బలపరాక్రమాల్ని కొనియాడింది లేనిప ప్రదర్శించింది. ఇంతకుముందు తన చెంతకు రాలేదనీ, అతని దగ్గరకు పిలిపించ లేదనీ నిష్టురోక్తులాడింది యాగ హవిర్భాగాల్ని పొందవలసిందిగా ప్రేరేపించి

నరకుడు అందులకంగీకరించి దేవాంగనల్ని, వస్తు వాహనాల్ని తీసికొని రాజధాని [మాహిష్మతీపురం] చేరుకొన్నాడు. త్వష్టకు [నవబ్రహ్మ], ఉదాహ జన్మించిన చతుర్థశి అనే కన్యను గంధగజ రూపాన తెచ్చుకొని సౌఖ్యాబ్ధిలో తేలా నాక భూలోకాల్లోని ధనమణివాసులను దెప్పించి ఆమెకు కానుకగా ఇచ్చాడు. గంధర్వ మనుష్య కాంతల్ని, పదహారువేల నూరుగురు అప్సరాంగనల్ని చెర తెచ్చి మణి పర్వతంలో పురాన్ని నిర్మించి కావలి బెట్టించాడు. మురాసురుడు : బలంతో అదితిని హింసించి ఆమె కుండలాల్ని అపహరించి తెచ్చి నరకాసు కిచ్చాడు. ప్రతిఫలంగా తన పుత్ర దశకానికి నరకాసుర రక్షకత్వాన్ని పొందా ముర నరకాసురులిద్దరూ దేవ మార్గాలుడిపి మునుల చిత్తాల్ని కలతపరచారు.

ఒకనాడు ఊర్వశి మాటలు గుర్తుచేసుకొని నరకుడు యాగ హవిర్భాగా పొందడానికి బదరికాశ్రమానికి వెళ్లాడు. స్వర్గమర్త్యాధిపతియైన తానే యాగ భాగ

దసి, తక్కిన వారు అనర్హులనీ చెప్పాడు. యాగ హవిర్భాగమిమ్మని కోరాడు ఋషు లందుకు అంగీకరించలేదు. నరకుని తూలనాడారు. నరకు డాగ్రహించాడు. ఆశ్రమం లోని మంచి మంచి వస్తువుల్ని, ఋషి కన్యకల్ని తీసుకరమ్మన్నాడు. ఋషిల్ని హింసించుమన్నాడు రాక్షసభటులు తమ ఏలిక ఆజ్ఞ నెరవేర్చారు. యతులనేక కష్టాల పాలయ్యారు. ముసికన్యలు చెరపోయారు. తమ పాట్లు తెలుపుకోడానికై కృష్ణునికి కానుకగా బదరీఫలాలు తీసుకొని భరద్వాజ కాశ్యప వశిష్ఠ వామదేవ జాబాలి కణ్వ బృహదశ్వ ధూమ్ర ప్రభృత మునులందరూ గంగనదాటి ద్వారకను చేరుకున్నారు. శైనేయుడు అతిథి సపర్యలు చేశాడు కృష్ణుడెదురువచ్చి వారిని తోడ్కొని వెళ్లాడు. ఋషులు నరకుని వలన తమపాట్లు విన్నవించుకొన్నారు. తమ యాగాలను ధ్వంసం చేయడం సరకుల్ని కన్యల్ని గొనిపోవడం వంటి నరకుని అకృత్యాల గురించి నివేదించారు. కృష్ణుడు ఆగ్రహోదగ్రుడయ్యాడు. ఋషులతన్ని కీర్తించారు.

ఋషులు వెళ్ళగానే దేవేంద్రుడు వచ్చి నరకుని విజృంభణను కృష్ణునికి తెలియజేశాడు తనపాట్లు నివేదించి శ్రీకృష్ణుని కీర్తించాడు. కృష్ణుడు దేవేంద్రునికి భయపడనవసరం లేదని అభయమిచ్చాడు. బదరికాశ్రమ ఋషులువచ్చి చెప్పినప్పుడే నరకునిపై తనకు కినుక పుట్టిందన్నాడు. అతనిపై దాడివెళ్ళడానికి గరుడిని కూడా రప్పించినట్లు చెప్పాడు. ఇంద్ర ఉపేంద్రులిద్దరూ వినువీధికెగశారు దేవేంద్రుడు యాదవేంద్రునితో కొంతదూరం వెళ్ళి తన స్వస్థానానికివెళ్లాడు. కృష్ణుడు మహిష్మతీ పురాన్ని చేరి దుర్గ రక్షక రక్షోభటుల్ని హతమార్చాడు. తన్నెదుర్చి వచ్చిన ఆరువేల పిశాచాల్ని అంతం చేశాడు. ఆదృశ్యాన్ని చూసి మురాసురుడు వచ్చి గద శక్త్యాది ఆయుధాల్ని హరిపై ప్రయోగించాడు. హరి కోదండ పాణియై వాడి కంఠాన్ని ఖండించి పాంచ జన్యాన్ని పూరించాడు. ఇంతలో నిశుంభుడెదుర్కొని బాణాల్ని, గదను ప్రయోగించాడు. హరినొచ్చాడు. వెంటనే సత్యభామ గద తీసికొని రుధిరధారలు గక్కేట్టు నిశుంభుని మీద వేసింది. అంతలో కృష్ణుడు తేరుకొని నిశిత బాణపరంపరలతో వానిని కడతేర్చాడు. తన్ను మార్కొనిన హయగ్రీవ పంచజనుల్ని కృష్ణుడు పట్టుబెట్టాడు

కృష్ణుడు ఈవిధంగా విజృంభించి ప్రాగ్జ్యోతిషపురం చేరి తన ప్రతాపం చూపాడు ఎనభై ఎనిమిదివేల రాక్షసులతని పైకి వచ్చారు. కృష్ణుని బాణవృష్టికి తట్టుకోలేక

కొందరు హతులయ్యారు. మరికొందరు పలాయనం చిత్తగించారు. ఇంతలో నరకాసురుడక్కడికివచ్చి తన సేనకు ధైర్యంచెప్పి యుద్ధోన్ముఖులుగా చేశాడు నరకాసురుడు అనేక బాణాలతో కృష్ణనెదుర్కొన్నాడు. నరకుడేసే బాణాల్ని సరకు చేయక గరుత్మంతుడు తనరెక్కలతో తాటించి నరకునిమీద, రథిక రథ్య రథాలమీద పడేట్లు చేశాడు. నరకుని బాణాలు సత్యభామ శరీరంలో నాటుకొని శృంగారాన్ని ఇనుమడింప జేశాయి. నరకుడు ప్రయోగించిన దివ్యబాణమొకటి నరకవైరి ఫాలభాగాన నాటుకొని బాధపెట్టింది. కృష్ణుడు మూర్ఛిల్లాడు. సత్య తాళ వృంతాల్ని వీచి అతని సేద దీర్చింది. 'యుద్ధము చేయు కోరిక గలదానవు ...వున చేయుమ'ని కృష్ణుడు వింటిని ఆమె కందించాడు సత్యభామ మహారోషంతో పోరాడింది. నరకుడు ప్రయోగించే బాణాల్ని, గద, శక్తి మొదలయిన ఆయుధాల్ని విరిచిపేసింది నరకాసురుని గొడుగును, కోదండాదుల్ని కూల్చింది. సారథిని హతమార్చి గెలుపు సాధించింది. కృష్ణుడు ఆమె యుద్ధ కౌశలానికి మెచ్చి కంఠాభరణ మిచ్చాడు నరకునితో యుద్ధానికి సిద్ధమయ్యాడు. నరకుడూ మరో కోదండాన్ని ధరించి వేరొక రథాన్ని అధిరోహించాడు. పలు బాణపరంపరతో సత్యాకృష్ణుల్ని గరుత్మంతుని కప్పాడు. నరక నరకాంతకులిద్దరికీ ఘోర సంగరమయింది. వివిధాయుధాలతో వారిద్దరూ పోరు సాగించారు. చక్రి చక్రంతో నరకుని ఖండించాడు భూదేవి అతని ఎదుట నిలిచింది. నరకుడు ధరించిన అదితి కుండలాల్ని కృష్ణుని కర్పించింది. నరకుడు విష్ణుపుత్రుడని విశదపరచింది. కృష్ణుని సద్గుణాల్ని కీర్తించింది.

2. 2. విప్రకుమార రక్షణం :

ద్వారవతిలో శ్రీకృష్ణుడు శాస్త్ర ప్రతిపాదితమయిన దీక్షనొకదాన్ని గైకొన్నాడు అప్పుడొక బ్రాహ్మణుడు వచ్చి దయనీయ వేషంతో పుత్ర శోకార్తచిత్తుడై కృష్ణుని కీర్తిస్తూ ఇలా అన్నాడు. "కృష్ణా! ఆపన్న శరణ్యా! నా ఆపద బాపిరక్షించుము". కృష్ణుడతని మాటలు విని అతనికి వచ్చిన ఆపద ఏమని ప్రశ్నించాడు. శోకిస్తూ "తన పుత్రత్రయాన్ని విధికొని చనిందనీ, తన భార్య మరలా పూర్ణగర్భవతి అనీ, ఈ సారి పుట్టే శిశువునైనాదక్కించి రక్షించుమ"ని కోరాడు కృష్ణుడతని వృత్తాంతం విని ఓదార్చాడు. ఆనాడు దీక్షతో ఉన్నందువల్ల మర్నాడు వస్తానని చెప్పాడు. ఆరోజే ప్రసూతికాలం కాబట్టి కృష్ణుడు గదాధరుడై స్వయంగా వచ్చి తన గృహద్వారంలో నిలిచి యముని బారినుండి రక్షించాలని విప్రుడు ప్రాధేయ పడ్డాడు.

నాచనసోమన భక్తితత్త్వం

కృష్ణుడు మదిలో చింతించడం, విప్రుని దీనావస్థచూచిన అర్జునుడు విప్రబాలక రక్షణకై తనను పంపుమని కృష్ణుని కోరాడు. తనచేతనే కావలసినకార్యం అర్జునుని చేత ఎట్లవుతనని కృష్ణుడు ప్రశ్నించాడు. అర్జునుడు లజ్జావనత వదనుడయ్యాడు. విప్రుని దైన్యం, అర్జునుని ధర్మాచరణ నియతిని దృష్టిలో ఉంచుకొని బలరామ ప్రద్యుమ్నులుదప్ప తక్కిన వారిని తీసికొని విప్రసహాయార్థం వెళ్ళిరమ్మని కృష్ణుడు ఆనతిచ్చాడు. సైన్యసమేతుడై అర్జునుడు విప్రుని ఇంటిలో ప్రసూతి సమయాన సమవర్తిరాకకువేచి ఉన్నాడు. ప్రకృతివైపరీత్యాలు ప్రస్ఫుటాలయ్యాయి. గాండీవ నారి ధ్వనించింది. గృహాంతర్భాగం నుంచి 'పట్టండితెండి' అనే మాటలు వినిపించాయి. విప్రాంగన 'పోయె పోయె' అనింది. బాలుడు పోయాడు. యదువృష్ణి భోజకాదులమోములు చిన్నబోయాయి. గాండీవం వాలిపోయింది. నష్టపుత్రకుడయిన విప్రుడు పుత్రమరణం సహింపలేక అర్జునుని అనేక విధాల నిందించాడు. అతనికి ఆగాండీవాన్నిచ్చిన అనలుని కూడా చులకన చేసిమాట్లాడాడు. విప్రుడు, తక్కిన పరిజనులు వెంటరాగా అర్జునుడు ద్వారవతి ప్రవేశించి కృష్ణుని ఎదుట నిలిచాడు.

కృష్ణుడు అర్జునుని గౌరవించి బ్రాహ్మణుని బుజ్జగించి "నీకుమారకులేలోకమందున్నను తెచ్చి యిత్తును ధృతి కలుగవలదని" బ్రాహ్మణునోదార్చాడు. అర్జున సారథ్యంలో విప్రసహితుడై సన్నాహక రథంలో ఉత్తరాభిముఖుడై బయలుదేరాడు. వనాలు, గంగానది, కాశ్మీరం, సింధుదేశందాటి హిమాచలన్నెక్కారు. హేమకూటాన్ని తొక్కి మేరువును గడచారు. అక్కడక్కడ వచ్చే ఏరుల్ని, అడవుల్ని అధిగమించి రత్నాకరుని సమీపించారు సముద్రుడు మురాంతకునికి అర్ఘ్యమిచ్చి పని ఆనతిమ్మని నిలిచాడు. రథం పోవడానికి దారినిమ్మని కృష్ణుడు కోరాడు. సముద్రుడట్టే చేశాడు. వారు ఉత్తర సాగరాన్ని ఉత్తరించారు. గంధమాదన పర్వతాన్ని చూశారు. జయంతం వైజయంతం, నీలం, రజతాచలం, మహామేరువు, కైలాసం, ఇంద్రకూటం అనే పర్వత సప్తకం తారసిల్లింది. తమను ఉపయోగించుకొమ్మని ఆ పర్వతాలు కోరాయి. వాటిపై రథం వెళ్ళడానికి దారి ఇయ్యండని కృష్ణుడు కోరాడు. అవి అట్లేచేసి అంతర్హితాలయ్యాయి. భయంకరమయిన ఘోరతమం రాగా రథమాగి పోయింది. చక్రి చక్రంతో దాన్ని ఖండించాడు. భూమ్యాకాశాలకు ఏకాకారంగా జగాన్ని నిండించే వెలుగు పురుషాకృతి పొడసూపింది. విప్రార్జునుల్ని అక్కడ నిలిపి కృష్ణుడు అ

వెలుగులోకి ప్రవేశించాడు విప్రకుమారుల తీసికొని వెలుపలికి వచ్చాడు. ఎవ్వరేయేట పుట్టారో ఆయేటి వయసుగల పుత్రత్రయాన్ని, వాడు పుట్టిన నాలుగో శిశువుని విప్రుని కందించాడు. వారందరూ ద్వారవతి చేరుకొన్నారు అర్ధదినంలో వెళ్ళిరావడం అందరికీ ఆశ్చర్యమయింది. కృత భోజనుడయిన విప్రుని వివిధార్థాలతో సత్కరించి కృష్ణుడు వీడ్కొలిపాడు. భోజనానంతరం ఇష్టకథాసల్లాప సమయంలో అర్జునుడు కృష్ణునికి ప్రణమిల్లి సముద్రజలం రథగమనానుకూలంగా గడ్డకట్టడం, సప్తాచలాలు రథానికి మార్గమొసగడం, చీకటి నరకు వడటం, తేజోపురుషుడు కనిపించడం కృష్ణుడతనిలో ప్రవేశించి విప్రబాలకుల్ని తీసికొని వెలుపలికి రావడం మొదలయిన అంశాల్ని విశదపరచుమని కోరాడు. ఆ తేజో పురుషుడు ప్రకృతి పురుషుడనీ, సకల చరాచరాలు అతనియందున్నాయనీ తెలిపాడు కృష్ణుడు ఆ పురుషుడు కృష్ణుని చూడ గోరడం వల్ల విప్రబాలకుల కోసం కృష్ణుడక్కడికి వస్తాడని మింగినట్టు చెప్పాడు తమంఖండించినవాడు, పర్వతసాగరాలు తానేననీ, తాను ప్రణవస్వరూపుడనీ బుద్ధి గమ్యమయిన తత్త్వాన్ని వాసుదేవుడు అర్జునునకుపదేశించాడు.

## 2. 3. ఘంటాకర్ణుని వృత్తాంతం :

నరకాసురాది దైత్యుల్ని హతమార్చి నరకాంతకుడు ద్వారకలో ఇష్టోపభోగాల ననుభవించేటప్పుడు రుక్మిణి ఏకాంతంగా ఒక వరమడిగింది. గుణరూపాల్లో కృష్ణుని వంటి కుమారుని దయచేయు మంది. తన కోరిక తిరస్కృతమయితే లోకుల్లోనూ సవత్నుల్లోనూ తాను చులకన కావలసి వస్తుందని తెలిసింది. కృష్ణుడామెకోరికను తీర్చడానికంగీకరించాడు సమస్తపరిజనులు కొలువరాగా నిండు కొలువు చేశాడు. తామింతవరకు చంపిన వైరుల సంగతి పేర్కొన్నాడు. పౌండ్రకుని బలాన్ని విశద పరచాడు. అతనికి తమపట్లగల అకారణవైరాన్ని చక్కగా బోధపరచాడు. అతని బారినుండి తమ నగరాన్ని, సమస్తప్రజల్ని రక్షించవలసిన ఆవశ్యకతను గురించి ప్రస్ఫుటం చేశాడు, యాదవులకు, సాత్యకికి, ఉద్ధవాచార్యునికి యథోచితంగా కర్తవ్యోపదేశం చేశాడు తానిలా చెప్పడానికిగల కారణాన్ని వెల్లడిచేస్తూ తన కైలాస దర్శన, ఈశ్వరసేవనాపేక్షల్ని వెలిబుచ్చాడు.

కైలాస గమనోన్ముఖుడైన కృష్ణుడు గరుత్మంతుని స్మరించాడు. గరుడుడు వచ్చి వినతుడయి నిలిచాడు. గరుడారూఢుడై గరుడ గమనుడు కైలాసానికి బయలు

దేరాడు. మార్గ మధ్యంలో సంధ్యాసమయాన బదరికాశ్రమం చేరుకొన్నాడు. గౌతమ, అత్రి, విశ్వామిత్రాది మహామునులతని కెదురు వచ్చారు. హరి గరుడునవతరించి యథోచితంగా వారిని సంభాషించాడు. వారతన్ని ఆశ్రమ మధ్య మండలి పర్ణశాలకు తీసికొని వెళ్ళి అతిథి సత్కారం చేశారు. ఆతని మహాత్మ్యాన్ని వేనోళ్ళ కొనియాడారు

ఋషులు తనను వీడ్కొనగా కృష్ణుడు గంగను దాటి మున్ను తాను తపస్సు చేసిన చోట యోగసమాధి స్థితుడయి శివుని ధ్యానిస్తూ ఉండిపోయాడు ఇంతలో భయపడి పారిగెత్తే జంతుతతి, సారమేయాల కోలాహలాలు వినవచ్చాయి. పైశాచిక సైనిక సమేతులయి పిశాచద్వయం తోచింది. వారు కృష్ణుని వైపుకేవచ్చి అతన్ని గురించి ప్రశ్నించారు. అక్కడ అతని ఉనికికి కారణ మడిగారు. కృష్ణుడు వారి మాటలవల్ల వారు తన భక్తులని తెలిసికొని తన వృత్తాంతాన్ని తెలియ జేశాడు. వారి బదరికావనంలో విహరించడం సమంజసం కాదన్నాడు. వారతని మాటలు లక్ష్య పెట్టలేదు. తాము ఘంటాకర్ణ, కాలాంతకులనీ ముక్కంటిని కొలిచేవారనీ కిన్నరేశుని పనికోసం అక్కడ తిరుగుతూ ఉన్నట్టు తెలియజేశారు. మాంసాన్ని, దర్భల్ని అక్కడపెట్టి ఘంటాకర్ణుడు హరిని మదిలో నిలిపి సమాధి నిమగ్నుడయ్యాడు, మనసులోనూ, వెలుపలనూ తాను దర్శించిన ఆకారమొకటిగానే ఉండటం అతనికి ఆశ్చర్యం కలిగించింది విష్ణుని వినుతించి ప్రణతులర్పించాడు. విప్రమాంసాన్ని అతనికి నివేదించ యత్నించాడు. కృష్ణుడది అనుచితమని వారించాడు. మిక్కిలి ప్రేమతో అతని శరీరాన్ని నిమిరాడు. ఘంటా కర్ణుడు సుందర రూపుడయ్యాడు. కృష్ణుడు ఘంటాకర్ణునికి ఇంద్ర పథాన్ని ఇచ్చాడు. 'కొన్నాళ్ళు స్వర్గోప భోగాల్ని అనుభవించి పరమాత్ముని జేరవస్తావ'ని ఆశీర్వదించాడు. అతనితమ్ముడు కూడా అతనివలే నాకసుఖాన్ని అనుభవించి తన తత్త్వాన్ని చేరవస్తాడని తెలియచేశాడు. ఘంటాకర్ణుని ఒకవరం కోరుకోమ్మన్నాడు. అతడు కృష్ణపదైకధ్యానాన్నే జన్మ జన్మకు వరంగా కోరాడు. అతనికి ఆ వరాననుగ్రహించి శక్రునితోబాటు స్వర్గాని కంపాడు. కృష్ణుడీవృత్తాంతాన్ని అక్కడి ఋషులకు చెప్పి నేత్రపర్వమేగాక కర్ణ పర్వం కూడా చేశాడు.

మరునాడు కృష్ణుడు ఋషుల్ని వీడ్కొని బయలుదేరాడు. కైలాసాన్ని దర్శించాడు. మానస సరోవరానికి ఉత్తరంగా గరుడునిడిగి ఒక చక్కని ప్రదేశంలో

ఫాల్గుణ మాసం మొదలు తపశ్చరణానికి పూనుకొన్నాడు. చక్రాద్యాయుధాలూ, నిత్యపూజకు వలసిన సంబారాలు సమకూర్చాయి. పన్నెండువత్సరాలు గడచాయి. దేవగంధర్వ సిద్ధసాధ్యులు జనార్దనుని తపస్సుకాశ్చర్యపడ్డారు. అతన్ని సందర్శించ డానికి వచ్చారు. బదరికాశ్రమ మునులూ అక్కడికి వచ్చారు. ఆకోలాహలాన్ని విని నియమం చెల్లడంవల్ల కృష్ణుడు కన్నులు తెరచాడు. కాలకాలుడూ ప్రత్యక్ష మయ్యాడు. కృష్ణుడతన్ని కొనియాడాడు. శివుడతని కేలుకేలు కొలిపి సమాదరించాడు.

కృష్ణుని పుత్రవాంఛ నెరిగిన శివుడు అతని కుమారుని అతనికిస్తానని చెప్పాడు. మన్మథుని అనంగత్వాన్ని ప్రస్తావించాడు. అతని అనంగత్వ హేతువయిన పూర్వ వృత్తాంతాన్ని చెప్పాడు. కృష్ణుని వేనోళ్ళ వినుతించాడు. హరిహరాభేదతత్త్వాన్ని ప్రతిపాదించాడు. కృష్ణుని వీడ్కొని అంతర్హితుడయ్యాడు. అక్కడికి వచ్చిన మునిబృందారక బందం కృష్ణుని వీడ్కొని మరలింది. కృష్ణుడు తార్క్ష్యునెక్కి ద్వారకకు బయలు దేరాడు.

## 2.4. పౌండ్రక వధ :

కృష్ణుడు మునుపటిలా బదరికాశ్రమానికి వెళ్ళి అక్కడి ఋషులతో సద్గోష్ఠి సాగించాడు. పౌండ్రక భూపాలుడు తానే వాసుదేవుడనీ, పంచాయుధాలు ధరించినా వసుదేవసూనుడు వాసుదేవుడు కాజాలడనీ, తనను వాసుదేవుడనక కృష్ణుని వాసుదేవు డనేవారు శతభార సువర్ణాన్ని అపరాధంగా చెల్లించవలసి ఉంటుందనీ పేరోలగం లో చాటాడు. శక్తివంతాలయిన తన పంచాయుధాలు కృష్ణుని పంచాయుధాలను అణగిస్తా యని గొప్పలు చెప్పుకొన్నాడు. అతని కొలువులోని శిష్టులు ఇతని చేతలకు ఆశ్చర్య పడ్డారు. ధూర్తులు 'భళీ' అనుకొన్నారు.

ఇంతలో కైలాసం నుండి నారదుడు అక్కడికి వచ్చాడు. అతిథిసత్కారా నంతరం పౌండ్రకుడు నారదునితో కృష్ణుని పలువిధాలుగా నిందించాడు. నారదుడత మాటలకునొచ్చి కృష్ణుని ఔన్నత్యాన్ని, పౌండ్రకుని అధమత్వాన్ని సోదాహరణంగా ఎత్తిచూపాడు. పౌండ్రకుడు చిన్నబోయాడు. శాపాస్త్రుడయిన నారదుని ఏమీ

చేయజాలక తనదారిన వెళ్ళమన్నాడు. యాదవుల చంపి మెప్పిస్తానన్నాడు. నారదుడు బదరికాశ్రమంలో ఉన్న కృష్ణుని సమీపించి పౌండ్రక వాసుదేవుని వృత్తాంతాన్ని వినిపించాడు. కృష్ణుడతన్ని సంహరిస్తానని అభయ మిచ్చాడు.

ఏకలవ్యాది నృప సహస్రానేకంతో పౌండ్రకుడు రాత్రిలో ద్వారకను ముట్టడించాడు. యదువీరుల్ని సాధిక్షేపంగా పేరుపేరునా పిలిచాడు. యాదవ పౌండ్రక సైన్యాలకు ఘోర సంగ్రామం జరిగింది. ఏకలవ్యుడు యదుయోధులందర్నీ తన ధనుర్విద్యా కౌశలంతో నొప్పించి వెనక్కి మరలించాడు. పౌండ్రకుడు విజయోత్సాహంతో ఉబ్బాడు. నగరంలో ప్రవేశించి దాన్ని ధ్వంశం చేయండని తన సైనికుల్ని ఆదేశించాడు. వారు నిచ్చెనలు, తాళ్లు మొదలయినవాటి సహాయంతో లోపల ప్రవేశించారు. మేడల్ని పడగొట్టి వస్తువుల్ని దోచుకొని పౌరుల్ని భయకంతుల్ని చేశారు. సాత్యకి కృష్ణుని వాక్యాల్ని స్మరించాడు. నగర రక్షణా కర్తవ్యాన్ని గుర్తించాడు. నగరంలో ప్రవేశించిన సైనికుల్ని వాయవ్యాస్త్రంతో మరలించాడు. బలభద్ర, ఉద్దవ, కృతవర్మాదులు వెంటరాగా కోటవెలుపలికి వచ్చి పౌండ్రసైన్యంతో తలపడ్డాడు. పౌండ్రక సాత్యకు లిద్దరూ భయంకరంగా పోరు సాగించారు. రథికులై ధనుర్యుద్ధాన్ని సాగించి గదలతో పోరారు. అనంతరం మల్లయుద్ధానికి తలపడ్డారు. సాత్యకి పౌండ్రకుని హతమారుస్తాడనీ, పౌండ్రకుడు సాత్యకిని పరిమారుస్తాడనీ చూపరులూహించేటట్టు ఒకరికొకరు తీసిపోని విధంగా వారిపోరు సాగింది. ఏకలవ్య బలరాము లిద్దరూ శస్త్ర ఖడ్గ గద శక్త్యాద్యాయుధాలతో భీకరంగా పోరారు.

మరునాడు తెల్లవారింది. బదరికాశ్రమ వాసుల వీడ్కోలు పొంది కృష్ణుడు ద్వారవతి సమీపించాడు. సమర కోలాహలాన్ని విని సంశయించి పౌండ్రకుని దాడిగా ఊహించాడు. పాంచజన్యాన్నొత్తి ఆత్మీయులకు మోదం వైరులకు భేదం కలిగించాడు. గరుడుని వీడ్కొని దారకునితో రథాన్ని తెప్పించుకొని యుద్ధానికి సిద్ధమయ్యాడు. పౌండ్రకుడు హరిమీదికి రాదొడగాడు. శైనేయుడతన్ని వారించాడు. కృష్ణుడు శైనేయుని వారించాడు. వాసుదేవులిద్దరూ పరస్పర సాధిక్షేపాలాడుకొన్నారు. ఇద్దరికీ ఘోర సంగ్రామమయింది. పౌండ్రకుడు ప్రయోగించిన ఆయుధాలన్నిటినీ కృష్ణుడు భగ్నంచేశాడు. గత్యంతరం లేక పౌండ్రకుడు రాళ్లు వేశాడు. కృష్ణుడు బాణాలతో వాటిని మరల్చి చక్రంతో పౌండ్రకుని ఖండించాడు. బలరాముడు

ఏకలవ్యుడు వేసిన శక్తిని సహించి గదను అతనిపై ప్రయోగించగా అతడు రథందిగి కాందిశీకుడయి పరుగెత్తాడు. బలరాముడు వెంబడించగా సముద్రంలో దూకి అయిదు యోజనాలు ఈది ఒకదీవి చేరుకున్నాడు. సాత్యకి, బలభద్రులంతకు పూర్వమే పేరోలగం చేస్తున్న కృష్ణుని చేరుకొన్నారు. కృష్ణుడు వారికి తాను వెళ్ళివచ్చిన వృత్తాంతాన్నంతా తెలిపాడు కృష్ణుడు అంతఃపురానికి వెళ్ళి తాను పోయి వచ్చిన వృత్తాంతాన్ని భార్యలకు తెలియజేశాడు. మొదట రుక్మిణితోనూ తరువాత సత్యభామతోనూ నెత్తమాడాడు.

పౌండ్రకుని చెలికాడయిన కాశీరాజు పౌండ్రకుని మరణంతో కినిశాడు. తాను పూర్వం ఈశ్వరుని వల్ల పొందిన కృత్యను కృష్ణుని మీదికి పంపాడు. అది అనల శిఖలతో ఆకాశాన్నంటుతూ ద్వారకలో ప్రవేశించింది దాన్ని చూసిన యాదవులు మిక్కిలి భయభ్రాంత చేతస్కులయ్యారు. సాత్యకి బలభద్రులకు సంగతి విన్నవించారు. వారు వృద్ధసామాసుల్ని అంతిపురానికిపంపి మాధవునికి వృత్తాంతం తెలియు జేయుమన్నారు. వారట్లే చేశారు కృష్ణుడు ద్యూతక్రీడా పారవశ్యంతో మొదట వారి మాటల్ని లక్ష్యపెట్టలేదు. పిదప వారి మాటలాలించి ద్వ్యర్థసంభాషణతో సత్యను వచ్చిన వారిని సంతోష పరచాడు. కృత్యా విజృంభణాన్ని మరల్చడానికి చక్ర ప్రయోగం చేశాడు కృష్ణునిచే ప్రయోగింపబడిన చక్రం కృత్యను వెన్నంటి వచ్చే టప్పుడు బ్రహ్మ, ఇంద్రాది దేవతలు దాన్ని కొనియాడి పైదొలగారు. ఈశ్వరుడు సపరివారంగా కాశీనగరాన్నుండి శతయోజన దూరంలో ఉన్న తపోయోగ్యమయిన తాలవనం చేరుకొన్నాడు, చక్రప్రభావమెరిగి ఉండటం వల్ల కృత్యకాశిరాజును ఆశ్రయించింది. చక్రం వారిద్దర్నీ వేరుచేసింది. కాశీనగరాన్ని తగులబెట్టింది. ముప్పై యేండ్లవరకు ఆచిచ్చు ఆరలేదు. చక్రం మరలా కృష్ణుని దగ్గరకు వచ్చి పాతాళానికి వెళ్లిపోయింది.

## 2.5. హంసడిభకోపాఖ్యానం :

సాళ్వదేశాన్ని బ్రహ్మదత్తుడనే రాజు పాలిస్తుండేవాడు. అతనికి సంతానం లేదు. అనన్య చింతతో పదిసంవత్సరాలు ఈశ్వరుణ్ణి ఆరాధించాడు. ఈశ్వరుడతనికి కలలో కనిపించాడు. వరం కోరుకోమన్నాడు. రాజు ఇద్దరు కుమారుల్ని కోరాడు.

ఈశ్వరుడు అనుగ్రహించాడు. బ్రహ్మదత్తునికి మిత్రుడయిన మిత్రసహుడు సంతాన ప్రాప్తికోసం అయిదు సంవత్సరాలు నారాయణుని ఆరాధించాడు. వెన్నుడు అతనికి స్వప్నంలో తోపట్టాడు. విప్రుడు పుత్రునర్థించాడు. వెన్నుడు అనుగ్రహించాడు.

శివాంశతో హంసడిభకులనే పేరుతో ఇద్దరు కుమారులు రాజుకు జన్మించారు జనార్దనుడనే పేరుతో మిత్రసహునకు కూడా ఒక కుమారుడు జన్మించాడు. వారు ముగ్గురూ వేదశాస్త్రవిద్యల్లో, ధనుర్విద్యాదుల్లో, తక్కిన కళల్లో నిష్ణాతులయ్యారు. హంసడిభకులిద్దరూ హిమవన్నగానికి వెళ్ళి అయిదు సంవత్సరాలు పార్వతీపతిని గురించి తపస్సుచేశారు. ఈశ్వరుడు ప్రత్యక్షమయ్యాడు. వారు అమరాసురాది సైన్యాలకోడమి, ఈశాన, రౌద్ర, మహేశ్వర, బ్రహ్మశిరాలనే అస్త్రాలు, అభేద్య కవచాలు, దివ్యచాపాలు, పరశ్వథవిశేషాలు, యుద్ధాలకు వెళ్ళేటప్పుడు రక్షణగా పక్కల్లో ప్రమథ ద్వయముండటం వరాలుగా పొందారు.

జనార్దనుడు ముందు వెళ్తుండగా సైన్యసమేతులయి హంసడిభకులు వేటకు వెళ్లారు. వనభూమి అంతాతిరిగి వివిధ వన్యమృగాల్ని వేటాడారు. మధ్యాహ్నమయింది వారికి కలసట వచ్చింది. సమీపస్థతటాకంలో నీరుగ్రోలి వృక్షఛాయలో కొంతసేపు విశ్రమించారు. వేదఘోష వినవస్తున్న కాశ్యపుని యాగభూమికి వెళ్లి ఆమునులకు నమస్కరించి సత్కారాలు పొందారు. హంసుడు కాశ్యపాదుల్ని తమ తండ్రి చేయ బోయే రాజసూయానికి రమ్మని ఆహ్వానించాడు. తన తమ్ముని పరాక్రమాన్ని, తన పరాక్రమాన్ని చెప్పుకొన్నాడు. ఋషులు రాజసూయానికి రావడానికి అంగీకరిం చారు. హంసడిభకులక్కడి నుండి వచ్చి తటాకోత్తర వనప్రదేశంలో సశిష్యుడయిన దుర్వాసమునిని చూశారు. హంసడిభకులు దుర్వాసుని సమీపించి అతని యతివేషాన్ని అపహసించారు. దుర్వాసుని మౌనాన్ని అధిక్షేపించారు. జనార్దనుడు వారి దురా లాపాల్ని వారించాడు. యతులను అపహసించడం హితం కాదన్నాడు. వారితోటి మైత్రి తనకు ముప్పు వాటిల్లుతుందని భీతిల్లాడు.

దుర్వాసుడు ఆగ్రహానుగ్రహ దృక్కులతో హంసడిభక, జనార్దనుల్ని చూశాడు. తాను శాపాస్త్రవిదయినా ఆగ్రహాన్ని నిగ్రహించు కోవలసి వచ్చినట్టు చెప్పాడు. కృష్ణుడే వారిని శిక్షించగలడని స్పష్టం చేశాడు. జనార్దనునికి కృష్ణమైత్రి

ప్రాప్తిస్తుందన్నాడు. హంసుడు దుర్వాసుని కౌపీనాన్ని చించాడు. జనార్దనుడు వారించాడు. అయినా దుర్మతులయిన హంసడిభకులు దంతం, కమండలం, పిదలం చిక్కం, సొమ్ములు మొదలయిన వాటిని కాల్చి తక్కిన వాటిని తీసికొని వెళ్లారు యతులందరూ చేరారు. ఈ దుర్గతిని శ్రీకృష్ణుడొక్కడే పరిష్కరించగలడని భావించారు అందరూ ద్వారక చేరారు. సుధర్మ సభలో వినోదిస్తున్న కృష్ణుని చూశారు. శ్రీకృష్ణుడు వారిని యథోచితంగా పూజించాడు. వారిరాకకు కారణమడిగాడు దుర్వాసుడు పలువిధాల కీర్తించాడు. హంసడిభకులు చేసిపోయిన దుర్న్యయాలు చెప్పాడు. వారివల్ల విధ్వస్తాలయిన వస్తువుల్ని చూపాడు. వారంతం కాకుంటే సహించడం ఎలా అని ఆగ్రహోదగ్రుడయ్యాడు. కృష్ణడతన్ని ఆశ్వాసించాడు. హంస డిభకుల్ని అంతంచేస్తానని హామీ ఇచ్చాడు. వారిని అతిథిసత్కారంతో తృప్తిపరచాడు.

హంసడిభకులు తమతండ్రి బ్రహ్మదత్తుని రాజసూయయాగం చేయుమని కోరారు. అతడందుకు అంగీకరించాడు. జనార్దనుడు వద్దని వారించాడు. బలవంతులయిన రాజుల బలపరాక్రమాల్ని తెలియజేశాడు. యాదవులతో ఉన్న వైరాన్ని గుర్తు చేశాడు. అయినా హంసడిభకులు అతని మాటను లక్ష్యపెట్టలేదు. ఎవ్వరూ తమకొక లెక్కగాదని అహంకరించారు. యాదవనగరానికి రాయబారిగా జనార్దనుణ్ణే వెళ్లిరమన్నారు. జనార్దనుడు సంతోషంతో కృష్ణరూపాన్ని మదిలో తలచుకొని యాదవ నగరానికి బయలుదేరాడు. కృష్ణుడు కుశలప్రశ్నానంతరం అతని రాకకు కారణమడిగాడు. జనార్దనుడు చెప్పడానికి కొంత సంశయించాడు. 'ఏలికలేమి చెప్పినా యథాతథంగా చెప్పడం దూత కర్తవ్యమనీ, వారిప్రభు సందేశాన్ని వినిపించుమని' జనార్దనుడు జనార్దనునికి ధైర్యం తెప్పించే మాటలు పలికాడు. 'హంస డిభకానుమతంతో బ్రహ్మ దత్తుడు కృష్ణుని ఆధ్వర్యంలో రాజసూయం తలపెట్టాడనీ, యాదవుల్ని ఉప్పు కప్పం లు తెమ్మని చెప్పుమని హంసడిభకులు తనను ఆదేశించినట్లు' జనార్దనుడు తెలియజేశాడు. కృష్ణుడురోషానికి మూలమయినహాసం చేశాడు. బ్రహ్మ దత్తాదుల్ని అధిక్షేపించాడు. కొలువుదీరి ఉన్న యాదవులకీసంగతి తెలిపాడు. వారు ఈ అపహాస్యప్రలాపాల్ని తలపోసి నవ్వుకొన్నారు పిరుల్ని కప్పంగాక యుద్ధమడగాలనీ, వెదకబోయిన తీగ కాలికి తగిలినట్లు హంసడిభకులతోటి యుద్ధం తనకు కలుగుతున్నట్లు కృష్ణుడు చెప్పాడు. తాను అమాటలు వారితో చెప్ప

లేనట్లయితే సాత్యకి రాయబారిగా రానున్నాడని చెప్పారు. హంసడింభకులతో ఉచితాలాపాలాది యుద్ధభూమిగా మధుర, ప్రయాగ, పుష్కరాల్లో ఏదైనా ఒకదాన్ని ఎన్నుకోవలసిందిగా వారితో చెప్పిరమ్మని కృష్ణుడు సాత్యకిని తన రాయబారిగా జనార్దనుని వెంట పంపాడు.

జనార్దన సమేతుడై జనార్దనుని పిట్కాని సాత్యకి సాళ్వనగరానికి వెళ్ళాడు. జనార్దనుడు రాకుమారుల మందిరానికి వెళ్ళి తాను వెళ్ళివచ్చిన వృత్తాంతం, సాత్యకి రాక, వారికి తెలియజేశాడు. వారి అనుమతంతో సాత్యకి లోపల ప్రవేశించి ఉచితాసనం మీద ఆసీనుడయ్యాడు. హంసుడు సాత్యకి నుద్దేశించి ప్రశంసా పూర్వకంగా మాట్లాడాడు. కృష్ణాది యాదవుల క్షేమవార్తలడిగాడు సాత్యకి సముచితంగా సమాధానం చెప్పాడు తానువెళ్ళివచ్చిన వృత్తాంతాన్ని చెప్పుమని హంసుడు జనార్దనుణ్ణి అడిగాడు. జనార్దనుడు కృష్ణదర్శనంలో తానుపొందిన అనుభూతిని ఆవిష్కరించాడు. "నేను మీరు చెప్పిన కప్పం విషయాన్ని చెప్పడానికి మోమోటపడ్డాను. కృష్ణుడుచెప్పమంటేచెప్పాను. నామాటలకునవ్వని వారు ఆసభలోలేరు. దుర్వాసనారదులతోసంభాషిస్తూ నామాటల్ని కృష్ణుడు నిర్లక్షించాడు" అన్న జనార్దనుని మాటలు విని హంసుడాగ్రహించి ఇలా అన్నాడు. "ఓ బ్రాహ్మణాధమా! నాముందే శత్రువుల్ని ప్రశంసిస్తావా? కృతఘ్నుడా! సభల్లో ఎలా మాట్లాడాలో తెలియని వాడివి. వైరి చుట్టమయ్యావు. నిన్ను చంపకూడదు. మా పట్టణం విడిచివెళ్ళు." హంసుడు సాత్యకి నుద్దేశించి "ఓరీ యాదవా! కష్టాత్మా! నీవు ఒకడే వచ్చిన విధమేమి? నాకు కప్ప మీక పోవడానికి కారణమేమి? కృష్ణుడేమన్నాడు. సాత్యకికూడా రోషావిష్టుడై సమాధాన మిచ్చాడు యదు పరాక్రమాన్ని ప్రశంసించాడు. కృష్ణుని నిందించిన హంసుని నాలుకను కోసి చేతికివ్వగలవాడనని పలికాడు. కార్యం పరువం తప్పిందన్నాడు. సంగరమే సంభవమన్నాడు. 'సంగరభూములుగా మధుర, పుష్కర, ప్రయాగలందేదో ఒక దాన్ని ఎన్నుకోమని కృష్ణుడు చెప్పాడు. నేను గోవర్ధనాన్ని ఇచ్చాను' అని సాత్యకి పలికాడు హంసడిభకులు ఆగ్రహోదగ్రులయ్యారు. హంసుడు సాత్యకి నుద్దేశించి దురాలాపాలాడాడు. దూత అవధ్యుడు కాబట్టి సాత్యకిని విడిచిపెట్టినట్టు చెప్పాడు. పుష్కరసరస్తీరానికి యుద్ధ సన్నద్ధులై రమ్మన్నాడు. సాత్యకి కోపించాడు. 'దూతకు కయ్యం పాడిగాదు గాబట్టి హంసడిభకుల్ని హతమార్చలేక పోయాన'న్నాడు. వారిదుగాలా

పాల్ని ఆహవంలో యథార్థాలు చేయమన్నాడు. అశ్వాదిరూఢుడై ద్వారక చేరాడు. తాను వెళ్లివచ్చిన వృత్తాంతాన్ని కృష్ణునికి నివేదించాడు.

వంది మాగధులు కొనియాడుతుండగా విప్రులు ఆశీర్వదిస్తుండగా వివిధ ఆయుధాలతో చతురంగసైన్యాలు వెంటరాగా కృష్ణుడు పుష్కర సరస్తీరం చేరుకొన్నాడు. ఎనభైఎనిమిది లక్షల దనుజ రాక్షస వీరులు సహాయంగా రాగా పది అక్షౌహిణుల సైన్యంతో మహేశ్వరాది దివ్యాస్త్రాలతో భూతద్వయం ముందు నడుస్తుండగా హంసడిభకులు కూడా పుష్కర సరస్తీరం చేరుకొన్నారు. ఘోరాహవమయింది. మధ్యాహ్నమయింది. కృష్ణుడు విచక్రుని, బలరాముడు హంసుని, సాత్యకి డిభకుని, ఉగ్రసేన వసుదేవులు హిడింబుని ఎదుర్కొన్నారు. చక్రి విచక్రులు వివిధ విధాల పోరారు. కృష్ణుడు ఆగ్నేయాస్త్రం ప్రయోగించి విచక్రుని హతమార్చాడు. రాక్షసులందరూ దిక్కు తెలియక పరుగెత్తారు. కొందరు సముద్రంలో జొచ్చి ముల్లయ్యారు. హంస బలరాములు సాత్యకి డిభకులు పరస్పరం బలాతిశయాల్ని ప్రదర్శించుకొన్నారు హిడింబుడు యదువీరుల్ని మింగడమే గాక ఉగ్రసేన వసుదేవుల శక్తి సామర్థ్యాల్ని వమ్ము చేశాడు. వారిద్దరినీ మింగడానికి ఉద్యమించాడు. వారిద్దరూ భయపడి పరుగెత్తారు. ఇంతలో బలరాముడు హిడింబుని తాకి ముష్టిఘాతం చవి చూపించాడు బలరామ హిడింబులకు భయంకర మల్లయుద్ధం సాగింది బలరాముడు తన ప్రహారాలతో హిడింబుడు కిందపడి మూర్ఛిల్లేట్టు చేశాడు. అతని శరీరాన్ని పట్టుకొని గిరగిర తిప్పి విసరివేశాడు. అది రెండు క్రోసుల దూరాన అరణ్య భూమిలో పడింది. సూర్యాస్తమయమయ్యింది. నాటి సంగ్రామం ముగిసింది మరునాడు గోవర్ధనగిరి కడ యుద్ధం సాగించేట్టు నిశ్చయమయింది.

మరునాడు తెల్లవారింది. గోవర్ధనాద్రి సమీపాన యమునానదితీరంలో ఉభయ సేనలూ తారసిల్లాయి. హంసుడు ఉగ్రసేనుణ్ణి, డిభకుడు వసుదేవుణ్ణి శరాలతో నొప్పించారు. యాదవులూ వారిని పొదివారు. తరువాత కృష్ణుడు హంసునితోను బలరాముడు డిభకునితోనూ తలపడ్డారు. శైవభూతద్వయం రాకుమారుల ఇరపార్శ్వాల్లోనూ తోచింది. కృష్ణుని శరీరంలో శూలాన్ని నాటేట్టు చేసింది. అతడు చిరునవ్వుతో వారి రథంపైకి ఉరికాడు. చేతపట్టి ఉత్తరాభిముఖంగా విసిరివైచాడు

ఆభూతాలు రెండూ కైలాసాద్రిపై పడ్డాయి. హంసుడు రోషావిష్టుడై కృష్ణునితో సాధిక్షేప దురాలాపాలాడాడు. నిశితాస్త్రాన్ని అతనిపై ప్రయోగించాడు. కృష్ణుడు ప్రత్యస్త్రాన్ని ప్రయోగించాడు. వారిద్దరికీ ఘోరయుద్ధం సంభవించింది. కృష్ణుడు యమునలో వార్చివచ్చి వైష్ణవాస్త్రాన్ని ప్రయోగించాడు. హంసుడు కాళిందీహ్రదంలో పడ్డాడు. హరికూడా అందులోప్రవేశించి హంసుని అట్టడుగుకు తొక్కాడు. బల భద్రునితో పోరుతున్న డిభకుడు హంసుని కాళిందీ ప్రవేశాన్ని గురించి విన్నాడు. మడుగులోకి దూకాడు. అన్న కనిపించక విలపించాడు. హరినడిగి తెలిసికొని హంసుని నదీప్రవేశం ధ్రువపరచుకొన్నాడు. నోరుకొట్టుకొన్నాడు. తలఊపాడు. నాలుక పెరుక్కొన్నాడు. నెత్తురు కక్కాడు. చావుకు తన్నుకొనే వాడిలా తపించాడు. తరువాత నదిలోదూకి ఆత్మార్పణం చేసుకొన్నాడు.

హంసడిభకులు పొలిసిన తరువాత కృష్ణాదులు గోవర్ధనగిరి తటంలో కొంత సేపు విహరించారు. వారి ఉనికి తెలిసికొని పుత్రదర్శనా లాలసులయి సపరివారంగా యశోదానందులు అక్కడికి వచ్చారు. పరస్పరం అభినందించుకొన్నారు. కృష్ణాదులు ప్రభాస తీర్థానికి వచ్చి అక్కడి ఋషుల అర్ఘ్యాదులు పొంది ద్వారక చేరుకున్నారు.

## 2. 6. బాణాసుర గర్వభంగం :

ఈశ్వరుడు కుమారుడయిన కుమారస్వామిని గౌరవించి ముద్దాడుతూ ఉండటం బలకుమారుడయిన బాణాసురుడు చూశాడు. కుమారుల్ని అలా గౌరవించే తండ్రులు ఉంటారా ? అని ఆశ్చర్యపడ్డాడు. తన తండ్రి ఉంటే కూడా తనను సయితం అలా గౌరవించి ఉండేవాడు కదా ? అని తలపోశాడు. ఈశ్వర పితృత్వాన్ని పొంది షణ్ముఖునిలా పితృ వాత్సల్యాన్ని పొందదలచాడు. శివునుద్దేశించి తపస్సు చేశాడు. ఈశ్వరుడు ప్రత్యక్షమయ్యాడు వరంకోరుకోమన్నాడు. బాణుడు శివునికి తాను కుమారుడు కావడం కోరాడు ఈశ్వరుడు పార్వతితో" నేటి నుండీ బాణుడు నీ కుమారుడు. గుహుడీతన్ని తన తమ్మునిగా సంభావిస్తాడు. పడగగా వాహనంగా నెమలి ఇతన్ని సేవిస్తుంటుంది. కుమారస్వామి ఇతనికి స్నేహితుడై చరిస్తాడు. శోణితపుర సమీపంలోనే ఆతనికి కూడా ఒక పట్టణాన్ని సృజియించి ఇవ్వు" అని పలికాడు. పార్వతి ఈశ్వరుణ్ణి ప్రశంసించింది.

బాణాసురుడు వరగర్వంతో దివిజకోటుల్ని బాధింప జొచ్చాడు. భూమండలం లోని రాజులందర్నీ గెలిచి నిలిచాడు. గాణాపత్యం పొందాడు. కార్తికేయ పర్వత కన్యలు తనపొత్తున మనుగడ సాగిస్తుండగా బాణుడు దనుజ శోభన కరుడై శోణిత పురాన్ని పాలింపసాగాడు.

బాణాసురుడొకనాడు నీలకంఠుని సమీపించి యుద్ధం లేకుండటంవల్ల తన పరాక్రమం నిస్సారంగా ఉందనీ, ప్రతివీరులతో యుద్ధం ప్రసాదించుమనీ, ఆయుద్ధం ఎప్పుడాసన్నమవునో తెలుపుమనీ కోరాడు. నెమలిటెక్కెం నేలగూలేటప్పుడు యుద్ధం సంభవిస్తుందని ఈశ్వరుడు తెలిపాడు. బాణాసురుడు సమధిక సంతోష స్వాంతుడై కొలువుకూటానికి వచ్చాడు మంత్రికుంభాండుడు అతని ఆనందానికి కారణమడిగాడు. తాను ఈశ్వరుణ్ణి యుద్ధమర్థించిన విధాన్ని, శిఖిధ్వజం నేలగూలే టప్పుడు యుద్ధమాసన్నమవుతుందని సాంబుడు ఇచ్చిన సమాధానాన్ని బాణాసురుడు వెల్లడి చేశాడు.

బాణాసుర కుంభాండులు మాట్లాడు కొంటుండగానే శిఖిధ్వజం నేలగూలింది. బాణునికి సంతోషం కుంభాండునికి దుఃఖం కలిగాయి. శోణితపురంలో శోణితవర్షం కురిసింది. మబ్బులు విజృంభించి గర్జించాయి, రాహువు రవిని ఒడిసిపట్టాడు. భూమి కంపించింది. ఎడతెగని పెనుగాలివీచింది. దక్షిణదిక్కున ధూమకేతువు తోచింది. అసుర కన్యలర్చించ బోయేటప్పుడు ఉన్నతమయిన రచ్చమాను ఒరిగింది. చుక్కలు నేలపై బడ్డాయి. సముద్రాలు కలగాయి. పలువిధ దుర్నిమిత్తాలు పొడసూపాయి. కుంభాండుడు ఎంతగానో విచారించాడు.

ఒకనాడు భవానీశంకరులు పరివారంతో వన విహారానికి వెళ్లారు. వలరాచ వేగిరంతో ప్రమత్తులయిన ప్రమథులు పలు విధాలుగా క్రీడించారు. మదనోద్దీపకంగా జలక్రీడలు సయితం సలిపారు. బాణాసురుని కుమార్తె ఉషాకన్య వారి క్రీడలన్నిటినీ తిలకించింది. పులకించింది. మదన వివశ అయ్యింది. "మగలు మన్నింప పెంపారు మానవతులు ప్రథమ జన్మంబునందెంత భాగ్యవతులొ" (5-71) అని తలపోసింది తన తలపు చెలులకు వెల్లడించింది. భవాని ఆమె మానసిక స్థితి గ్రహించింది

ఆమెకు వాంఛిత సిద్ధి అవుతుందని ఆశీర్వదించింది అది 'ఎన్నడౌదగూడున'ని ఉషా కన్య ప్రశ్నించింది. "వైశాఖ శుద్ధ ద్వాదశినాటి రాత్రి సౌధోపరి భాగంలో పడుకొని ఉన్నప్పుడు స్వప్నంలో నిన్ను మరుకేళి దేల్చేవాడే నీమగడని" పార్వతి పలికింది.

ఒకనాటి రాత్రి ఉషాకన్య తనసౌధోపరిభాగంలో నిద్రిస్తూ ఉంది. స్వప్నంలో ఒక సుందరాకారుడు ఆమెనేమో చేశాడు. ఆమె దిగ్గున మేల్కొంది. కలలో కలిసిన రూపం కనిపించలేదు. ఎవడో తనను అవమానపరచే అకృత్య మాచరించాడని వాపోయింది అవమాన భారంతో కుంగిపోయింది. శోకించింది. చెలికత్తె చిత్రరేఖ (కుంభాండుని కుమార్తె) అక్కడికి వచ్చింది. ఆమె చింతకు కారణమడిగి తెలిసికొంది వివిధ హితోక్తులతో ఊరడించింది. వనవిహారంలో ఉషాకన్యకు అభీష్టసిద్ధి అవుతుందని కాత్యాయని పలికిన పలుకులు గుర్తుచేసింది. ఉషాకన్య అవమాన తాపం విడిచి విరహ తాపానలానికి గురిఅయింది. కలలో ఆమెను కలసిన పురుషుడెవ్వడని చిత్రరేఖ ప్రశ్నించింది. కానీ ఉషాకన్య తెలుపలేకపోయింది. 'విశ్వంలోని పురుషులందర్నీ చిత్రపటంలో చిత్రించి ఏడురోజుల్లో తెచ్చి చూపుతాననీ, వారిలో ఆమె మనోహరుడెవ్వడో తెలియ జేయ వలసిందనీ' చెప్పి చిత్రరేఖ వెళ్ళింది. ఉషాకన్య విరహతాపం అంతకంతకు అగ్గలమయింది చెలులు శైత్యోపచారాలు చేశారు. ఇంతలో చిత్రరేఖ రాక వారి కందరికీ ఊరటకలిగించింది, ఆమె తన నేర్పుతో త్రిలోక సుందర పురుషుల నొక చిత్రపటంలో చిత్రించి తెచ్చి చూపింది. ఉషాకన్య అందర్నీ చూస్తూ వచ్చి ద్వారకా నగరంలోని అనిరుద్ధుని చూసింది అతడే తన మనోహరుడని తెలిపింది. చిత్రరేఖ వల్ల అతని కులశీల వృత్తాదుల నెరిగింది. అతనితో సమాగమమెలా పొసగుతుందని విచారించించింది. చిత్రరేఖ 'అనిరుద్ధుని తెచ్చి అప్పగిస్తానని' చెప్పింది అంతః పురంలో రహస్యాన్ని పదిలపరుచుమంది తగిన కావలిని ఏర్పాటు చేయుమంది.

తన మాయా విద్యవల్ల చిత్రరేఖ ద్వారక చేరుకొంది. ఒక సరోవర తీరంలో భగవద్ధ్యానైక చిత్తుడయిన నారదుణ్ణి దర్శించింది, నమస్కరించింది. నారదుడామె రాకకు కారణమడిగాడు. కాత్యాయనీ ప్రసన్నత. ఉషారమణి స్వప్నవృత్తాంతం. తన చిత్రపటలేఖనం, అనిరుద్ధ సందర్శనం, తాను అనిరుద్ధుణ్ణి తీసికొని వెళ్లడానికై రావడం మొదలయిన అంశాల్ని చిత్రరేఖ నారదునికి నివేదించింది. బాణానిరుద్ధులకు

యుద్ధం సిద్ధమవుతుందనీ చక్రికి వృత్తాంతం తెలిపి తోడితెమ్మనీ చెప్పింది. కమల నాభుడు తనను శపించకుండ ఉండేట్టు చూడుమని కోరింది. నారదుడు చిత్రరేఖ పథకాన్ని మిక్కిలి హర్షంతో ఆమోదించాడు. చిత్రరేఖ మాయోపాయంతో అదృశ్యంగా ప్రద్యుమ్నాంతఃపురం ప్రవేశించింది. అనిరుద్ధుని చూసింది. అతని సౌందర్య విలాసాలకు ఆశ్చర్యపడింది. తామసీ విద్యవల్ల అతన్ని నిస్పృహునిగా చేసింది. అతన్ని హొదివి పట్టుకొని ఉషాసౌధానికి చేర్చింది. పాన్పుమీద పడుకోబెట్టింది. ఉషాకన్య సంతోషించింది చిత్రరేఖ రాకపోకలు పెద్దలయిన కృత్యాలు ముహూర్తత్రయంలోనే పూర్తికావడానికి ఆశ్చర్యపడింది. అతిశయించిన విరహంతో అనిరుద్ధుని పైకొంది చిత్రరేఖ అనిరుద్ధుని లబ్ధస్పృహుని చేసింది. అతడు తనస్థితి కలా? నిజమా? అని వితర్కించుకొన్నాడు. చిత్రరేఖ వారిని వీడ్కొని వెళ్ళింది.

ఉషాకన్య వల్ల అనిరుద్ధుడు జరిగింది తెలిసికొన్నాడు. ఆనందించాడు ఉషానిరుద్ధులు కొన్నాళ్ళు ఇష్టోపభోగాల్లో తేలాడారు. బాణభటులు కొందరు ఉషానిరుద్ధుల వృత్తాంతాన్ని బాణునికి నివేదించారు. బాణుడు ఆగ్రహించాడు. అనిరుద్ధునిపైకి రాక్షసవీరుల నంపాడు. అనిరుద్ధుడు సింహగర్జన చేసి సౌధం దిగివచ్చి పరిఘంతో వారిని పరిమార్చి విజృంభించాడు. హతశేషులయిన దనుజులు బాణుని కడకువెళ్ళి సంగతి తెలిపారు

బాణుడు పదివేలు పదివేలుగా సైన్యాన్ని విభజించి కృష్ణపౌత్రుని మీదికంపాడు ఇరవైనాలుగువేల మంది వీరుల్ని అనిరుద్ధుడు హతమార్చాడు వివిధయుద్ధ విద్యలతో దానవ సైన్యాన్ని వధించి చిందరవందర చేశాడు. తుదకు కుంభాండుడు తెచ్చిన రథం మీద కూర్చొని బాణాసురుడు అనిరుద్ధునితో తలపడ్డాడు బాణాసురుని ఆయుధాలన్నిటినీ కృష్ణపౌత్రుడు వమ్ము చేశాడు. అనిరుద్ధుని ఎదురుగా నిల్చిపోరడం అసాధ్యమనీ మాయావిద్యతో అతన్ని గెలువ వలసి ఉందనీ కుంభాండుడు సలహా ఇచ్చాడు. బాణాసురుడు ఆకాశానికెగశాడు. నాగాస్త్రాల్ని అనిరుద్ధుని మీదికి ప్రయోగించాడు అనిరుద్ధుడు నాగాస్త్రబద్ధుడయ్యాడు. అతన్ని వధించండని అసురపతి ఆదేశించాడు కుంభాండుడు వారించాడు. అదిక్షత్రియోచితం కాదన్నాడు చివరకు ఉషానిరుద్ధుల్ని కారాగారంలో బంధించండని బలిపుత్రుడు ఆదేశించాడు. సపరివారంగా స్వగృహానికి మరలాడు.

ద్వారకతో అనిరుద్ధుడు కనిపించక అంతః పురాంగనలందరూ ఆర్త చిత్తులయ్యారు. అతని జాడ తెలియక పోవడం అందరికీ కలవరపాటు కలిగించింది. బలరామ కృష్ణ సాత్యకులు పేరోలగం చేశారు. అనిరుద్ధుని పోక ఎవరికీ అంతుబట్టలేదు. ఆందోళన కలిగించింది. నాలుగు దిక్కులకు చారుల నంపారు. సేనాపతి ఇంద్రుడే ఆ దుండగానికి ఒడిగట్టి ఉండవచ్చని సందియం వెలిబుచ్చాడు. కంసారి అది సరి కాదన్నాడు. అక్రూరుడు కృష్ణనే సమర్థించాడు. ఇంతలో చారులు వచ్చారు. అనిరుద్ధుని జాడ తెలియలేదన్నారు.

అప్పుడే నారదుడక్కడికి వచ్చాడు కృష్ణుడతన్ని సముచితంగా సత్కరించాడు. నారదుడు కృష్ణాదుల విచారానికి కారణ మడిగాడు. అనిరుద్ధుని ఆకస్మిక అదృశ్యం గురించి కృష్ణుడు తెలియజేశాడు. అనిరుద్ధుని ఉషా కన్యకై చిత్రరేఖ తీసికొని పోవడం. అనిరుద్ధ బాణాసురులకు పొసగిన పోరు, బాణాసురుడు మాయా యుద్ధంలో నాగపాశ బద్ధుని జేసి అనిరుద్ధుని కారాగృహంలో బంధించడం మొదలయిన అంశాల్ని నారదుడు కృష్ణునికి నివేదించాడు. కృష్ణుడు బాణాసురునితో యుద్ధం చేయడానికి సైన్యం సిద్ధం చేయాలనుకున్నాడు. రాక్షసులక్కడికి పద్నాలుగు వేల యోజనాల దూరంలో ఉండటం వల్ల మానవమాత్రులక్కడికి వెళ్ళడం దుస్సాధ్యమని నారదుడు వారించాడు. గరుత్మంతుని సహాయంగా తీసికొమ్మని సలహా ఇచ్చాడు కృష్ణుడు గరుత్మంతుని స్మరించాడు. అతడూ వచ్చాడు. సాత్యకిని నగర రక్షణకు నియోగించి కృష్ణుడు బలభద్ర ప్రద్యుమ్న సమేతుడై బాణుని వీడికి దాడి వెళ్ళాడు వారు ముగ్గురూ గిరి వ్రజాన్ని సమీపించారు. కృష్ణుని ప్రేరణతో ఆ దుర్గం చుట్టూ దుస్సహంగా ఉన్న ఆహవాగ్నిని గంగా జలం తెచ్చి గరుత్మంతుడు ఆర్పివేశాడు వారి సాహసానికి అక్కడి వారు ఆశ్చర్యపడ్డారు. మంటజోదులవంటి కల్మాషకుసుమ, దహన, తృషిత, మహాబల, తపనులనే అయిదుగురు మురారితో తలపడి తొలగారు. నగర రక్షకులయిన అగ్ని వీరులయిదుగురు మురారితో పోరుకు తలపడ్డారు. రెండుమంటలు పురుషాకృతిలో నడుపగా మధ్య రథారూఢుడై అంగిరస మహర్షి కృష్ణునెదిర్చ వచ్చాడు. కృష్ణుడతన్ని అపహసించాడు. అంగిరసుడు శూలాన్ని ప్రయోగించాడు. కృష్ణుడు దాన్ని భగ్నం చేశాడు. అంగీరసుని వక్షంలో బాణాలు నాటాడు. అతడు తూలిసోలాడు. తక్కిన

నలుగురూ అతని కళేబరాన్ని తీసికొనివెళ్ళి బాణునికి చూపారు. కృష్ణుడు పాంచ జన్యాన్ని పూరించాడు.

గిరివ్రజం గజిబిజి అయింది. సైన్యాన్ని సమాయత్తపరచి బాణుడు కృష్ణాదుల మీదికి పురికొల్పాడు. ఇరుపక్షాలవారికీ భీకర సంగరమయింది. కృష్ణాదుల శరీరాల నుండిచిందే రక్తాన్ని భూతగణం తాగజొచ్చింది. బలరాముడది నివారించమని కృష్ణునితో చెప్పాడు. కృష్ణుడు బాణాసురుని సైన్యం మీదికి ఆగ్నేయాస్త్రాన్ని ప్రయోగించాడు. అది పలువుర్ని దహించి బీభత్సం గలిగించింది. బాణుని సైన్యం వెనుదిరిగి నగరు సొచ్చింది. గరుత్మంతుడూ వారిని వెంబడించాడు.

దైత్యసేనలతో బాటు ప్రమథ సైన్యంకూడా కృష్ణాదుల నెదుర్కొంది. బలరాముడు ఆ సైన్యానికి తనసేవ చూపించుమని కృష్ణునితో చెప్పాడు కృష్ణుడు గరుడుని నేలకు దింపాడు. కృష్ణాదులు భయంకరంగా పోరి శత్రుసైన్యానికి అపార నష్టం కలిగించారు అసురసేనవిచ్చి పరుగు తీసింది. అసురారి పాంచజన్యాన్నొత్తాడు.

ప్రమథాధిపుని ప్రేరణతో శివజ్వరం బలరాముని ఎదురుగా కనిపించింది. సాక్షేపంగా సంగర సంసిద్ధుని కమ్మంది. జ్వర బలరాములకు పోరు ఘోరమయింది. చివరకు జ్వరం బలరామనిలో ప్రవేశించి చీకాకు పరచింది. బలరాముడు శోషిల్లాడు. కావాడుమని కృష్ణుని వేడాడు. కృష్ణుడు బలరాముని కౌగలించుకొన్నాడు జ్వరపీడ తొలగింది తనతో పోరుమని కృష్ణుడు శివజ్వరాన్ని సవాలు చేశాడు. కృష్ణశివ జ్వరాలిద్దరూ పరస్పరం తీసిపోని విధంగా యుద్ధం చేశారు కృష్ణుడు శివజ్వరాన్ని తన బాహుబలంతో దూరంగా పడవేశాడు. జ్వరుడు మృతుడయ్యాడని ప్రమత్తుడై ఉండిపోయాడు. జ్వరం అదను కనిపెట్టి కృష్ణునిలో ప్రవేశించి పీడించింది. కృష్ణుడు దానికిప్రతిగా వైష్ణవ జ్వరాన్ని సృజించాడు. అది కృష్ణునిలోని శైవజ్వరాన్ని వెడలించి దానితో తలపడింది. జ్వరాలు రెండూ నానా ప్రకారాలుగా ఘోరాహవం సాగించాయి. చిట్టచివరకు వైష్ణవ జ్వరం శైవజ్వరాన్ని పట్టుకొని 'వధించమందువా? ఏమిచేయు మందువని' కృష్ణుని ప్రశ్నించింది. 'శైవజ్వరాన్ని వధించడడం ఉచితంకాదు దాన్ని కాపాడుమ'ని అశరీరవాణి కృష్ణుని కోరింది. కృష్ణుడు అంగీకరించి వైష్ణవ జ్వరాన్ని

శాంతింపజేశాడు. శైవజ్వరం బ్రతికింది. కృష్ణునికి పాదాభివందనం చేసి వినుతించింది. వైష్ణవజ్వరాన్ని మరల్చి తన్ను కాపాడుమని శైవజ్వరం కోరింది. నారాయణుడంగీకరించి 'మీరిద్దరూ ప్రపంచంలో సంచరించండ'ని ఆనతిచ్చాడు. శాంకరజ్వరం నమస్కరించి వెళ్లిపోయిలది.

కృష్ణాదులు రాక్షససేనమీదికి విజృంభించారు. గరుడారూఢులయిన వారుముగ్గురూ యథాశక్తి సామర్థ్యాల్ని ప్రదర్శించి ప్రతి వీరసైన్యాన్ని దారుణంగా హతమార్చారు. హతశేషులు పరుగిడజొచ్చారు. బాణకుంభాండులు సముచిత వచనాలతో వారినివారించి యుద్ధోన్ముఖుల చేయప్రయత్నించారు. ఇంతలో శివుడు సపరివారంగా యుద్ధసన్నద్ధుడయి వచ్చాడు. జనార్దను నెదిర్చి నిల్చాడు శివకేశవలిద్దరూ విజృంభించి వివిధాస్త్రాలతో యుద్ధం చేశారు. చివరకు కృష్ణుడు శంకరుని మీద జృంభణాస్త్రాన్ని ప్రయోగించాడు. శంకరుడు ఆవులిస్తూ దిక్కులు చూస్తూ వడకుతూ యుద్ధం నుంచి వైదొలగి నిశ్చేష్టుడై నిలబడి పోయాడు. బాణునితో బాటు అసురసేన చెల్లాచెదరై పరుగెత్తడం మొదలెట్టింది.

ఇంతలో కుమారస్వామి రోషావిష్టుడై బాణునికి బాసటగా కృష్ణాదుల నెదిర్చి నిలిచాడు. కుమార, వసుదేవ కుమారులిద్దరికీ సంగరం సంఘటిల్లింది. గుహుడు ప్రయోగించిన ఆయుధాలన్నింటినీ యదూద్వహుడు వమ్ముచేశాడు స్కందుడు చేసేదిలేక వైదొలగారు.

పూర్వజ సహితుడై కృష్ణుడు బాణుని వధించడానికి వెళ్ళసాగాడు. అగ్నికతోచింది. కృష్ణుడు మారుమొగం పెట్టాడు. ద్వాదశ వర్షాలు తన్ను కొలిచిన ఫలం అగ్నిక నొకసారి చూస్తేనే నశిస్తుందని శపించాడు.

ఆర్తభీతచిత్తులై పరుగెత్తే రాక్షససైన్యాన్ని సమీకరించుకొని బాణాసురుడు కృష్ణునితో యుద్ధానికి సిద్ధమయ్యాడు పలుదంభోక్తులాడాడు కృష్ణుడు 'వట్టిమాటలు కట్టిపెట్టి యుద్ధానికి పూనుకొమ్మ'న్నాడు బాణునిమీద దివ్యాస్త్రాలు ప్రయోగించాడు. బాణుడు తనదగ్గరున్న అస్త్రాలన్నింటినీ ప్రయోగించాడు. ప్రయోజనం లేకపోయింది తుదకు బ్రహ్మ శిరోనామకాస్త్రం ప్రయోగించాడు. కృష్ణుడు చక్రంతో దాన్ని భగ్నంచేశాడు. బాణుని బాహువుల్ని ఖండించడానికి చక్రం ప్రయోగింప సమకట్టాడు

ఎదుట అగ్నికతో పట్టింది కృష్ణుడు కళ్ళు మూసుకొని భుజద్వయం మినహా తక్కిన భుజాల్ని ఖండించేట్టు చక్రాన్ని ప్రయోగించాడు. అది అట్లే చేసి కృష్ణుని వద్దకు వచ్చింది శిరశ్ఛేదనకు ఆజ్ఞవేడింది కృష్ణుడు సంతసించి అందుకు అంగీకరింప సంకల్పించాడు.

ఇంతలో సపరివారుడై సాంబుడు సాక్షాత్కరించాడు. బాణుని కావమన్నాడు. పురారాతి బాణుని కాచినట్లే తానూ కాపాడుతానని కృష్ణుడు అభయమిచ్చాడు. శివానుజ్ఞాతుడై తరువాతి కార్యానికి వెళ్లాడు. మూర్ఛితుడై పడి ఉన్న బాణాసురుని నందీశ్వరుడు లేపాడు. శంకరునిముందు నర్తించ నియోగించాడు. బాణాసుర ఆడాడు. భవుడు సంతృప్తుడయ్యాడు. అతని కోరిక మీద అజరామరత్వాది వరపంచకాన్ని ఇచ్చాడు.

కృష్ణుడు గరుత్మారూఢుడై బాణుని ఇంటికి వెళ్లాడు. అనిరుద్ధుని సమీపించాడు- గరుడదర్శన మాత్రంతోనే నాగాస్త్రపాశాలు సడలాయి. చక్రహస్తుడు పీడిత దేహుడయిన అనిరుద్ధుని శరీరం నిమిరాడు. అతడు స్వస్థుడయ్యాడు. సఖీసహిత దనుజాంగనా సమేతుడయిన అనిరుద్ధుని గరుడుని మీద ఎక్కించుకొని సపరివారంగా కృష్ణుడు పయనించాడు.

బాణుని గోధనాన్ని గైకొనడానికి కృష్ణుడు వరుణనగరం సమీపించాడు. అక్కడి గోవుల్ని పట్టుకోబోగా గోపాలకులతో సంగరమయింది వారందరూ కృష్ణుని బాణాలకు ఓర్వలేక పరుగెత్తారు. వరుణుడు కూడావచ్చి కృష్ణునితో యుద్ధం చేశాడు. కృష్ణుడు అతనిమీద చక్రం ప్రయోగింప సమకట్టాడు వరుణుడు కృష్ణుని శరణుజొచ్చి వినుతించాడు. నారాయణుడు అభయమిచ్చాడు. 'బాణుని గోగణాన్ని సమర్పించుమ'న్నాడు. 'తన ప్రాణాలు పోయాకే గోగణం అన్యుల వశమవుతుందని' వరుణుడు బాణునికి బాసచేసినట్టు చెప్పాడు. తన్నువధించి గోగణాన్ని తీసికొని వెళ్లుమన్నాడు. కృష్ణుడు ఆ గోగణాన్ని వరుణునికే ఇచ్చివేశాడు. సురాదులు వెంటరాగా తనవారితో కూడి అచ్యుతుడు ద్వారక చేరుకొన్నాడు.

మూల హరివంశంలో పలు కథలుండగా సోమన ఉత్తర హరివంశంలో పై చెప్పబడిన ఆరు కథల్ని మాత్రమే గ్రహించాడు. పారిజాతాపహరణ వృత్తాంత

## నాచనసోమన భక్తితత్త్వం

రమణీయమయినా కృష్ణలీలా వినోదానికి తగదని సోమన పరిత్యజించాడు. ప్రద్యుమ్నుని కథ రసవత్తరమయినా కృష్ణ ప్రాధాన్యం గాక పోవడం వల్ల పరిగ్రహించాడు గ్రహించిన కథల్లో శ్రీకృష్ణుడు నాయకుడు. వసుంధరా భర్తృత్వాన్ని కల్పించడం నరకాసురుని కథ వల్ల కలిగిన ప్రయోజనం, బ్రాహ్మణ బాలకుని రక్షించడం వల్ల మృత్యువును శాసించే అధికారం సంక్రమించింది, ఘంటాకర్ణాదుల ననుగ్రహించడం వల్ల యథేచ్ఛగా పదవుల నిచ్చే సార్వభౌమత్వం ప్రతిపాదింపబడింది. పౌండ్రక హంసడిభక వధాదుల వల్ల దుష్ట శిక్షణ నిరూపింపబడింది పుత్రార్థం తపస్సుచేయడం హరిహరాభేదాన్ని ప్రస్ఫుటం చేయడమే. బాణాసుర వృత్తాంతంలో కృష్ణుడు శివాదుల్ని సయితం జయించాడు. ఇది అతని సర్వాధిక్యతను నిరూపించడానికి చక్కని ఉదాహరణ. ఈ విధంగా ఈ సత్యాలకు అనుగుణమయిన కథల్ని మాత్రమే సోమన గ్రహించడం గమనింపదగి ఉంది.



# 3. భక్తి - నిర్వచనం

నేడు ఐహిక జీవితం ఆందోళన పెంచింది. పారమార్థిక జీవితంలో మక్కువ ఎక్కువయింది. పారమార్థిక జీవితానికి ప్రథమ సోపానం భక్తి అని చెప్పుకోవచ్చు భగవదైక్యానికి గల మార్గాల్లో కర్మ, జ్ఞాన, భక్తియోగాలు ముఖ్యమయినవి. వీటిలో భక్తి ప్రధానమయింది. కర్మ, జ్ఞానయోగాలకంటె కూడా భక్తిఎంతో శ్రేష్ఠమయిందని నారదుని అభిప్రాయం. కాబట్టే పరమార్థ సాధకులందరూ భక్తినే ప్రాథమిక దశలో అవలంబించి కృతకృత్యులయ్యారు మహోత్కృష్టమయిన ఈ భక్తిని మహనీయులనేకులు తమ చిత్తవృత్తి కనుగుణంగా నిర్వచించారు.

‘భజ్’ ధాతువుకు ‘క్తి’ ప్రత్యయంచేరి భక్తి శబ్దమేర్పడింది సేవచేయడం, భజించడం, అర్చించడం, ప్రేమించడం అని అర్థం. కేవలం ఈశ్వరోపాసన లేక ఈశ్వరుని ప్రేమించడమే భక్తి అని శాస్త్రజ్ఞులభిప్రాయపడ్డారు ప్రాచీన భక్తి సూత్రకారులయిన నారదాచార్యులు "భగవంతుని యందలి పరమప్రేమయే భక్తి" (నారద సూ. 2) అనీ శాండిల్య మహర్షి "ఈశ్వరుని యందలి నిరతిశయమయిన అనురక్తియే భక్తి" (శాండిల్య సూ. 2) అనీ నిర్వచించారు. "పరమేశ్వర స్వభావ వైభవముల గ్రహించిన పిమ్మట జనించు రక్తియే భక్తి" అని శాండిల్య సూత్ర వ్యాఖ్యాత అయిన స్వప్నేశ్వరుని వ్యాఖ్యానం. (స్వప్నేశ్వర భాష్యము–శాండిల్య సూ. 1–1–2) "భగవంతుని యెడ నిర్హేతుకము, నిష్కామము. నిరంతరమునైన పరిశుద్ధప్రేమయే భక్తి" అని భాగవత ప్రవచనం. (భాగవతం 3–29–11,12) "అవివేకులకు ఇంద్రియార్థములందు ఎట్టి ప్రీతికలదో అట్టి ప్రీతిని భగవంతుని యందుంచుకొనుట భక్తి యగునని" ప్రహ్లాదుని ఉపదేశం. ( విష్ణుపురాణము ) "స్వస్వరూపాను సంధానము–లేదా ఆత్మనిష్ఠయే భక్తి" అని శ్రీశంకరులు అభిప్రాయపడ్డారు (వివేక చూడామణి – గీతాభాష్యము 18–54) "నిరవధికానంతానవద్య కల్యాణగుణ సంపన్నుడను జ్ఞానముతో తనయందుగాని, తనవారి యందుగాని, తుదకు సమస్త వస్తువులందు గాని తనకుండు ప్రీతికంటె అనేకరెట్లు అధికమగు ప్రీతితో ఎలకొంది అంతరాయములు వచ్చినను పట్టువదలక, నిరంతరము భగవంతుని యెడ

తన ప్రేమను ప్రవహింప జేయుటయే భక్తి"-అని శ్రీమద్రామానుజులు తెలిపారు. "ఏ స్నేహము జ్ఞాన పూర్వకము, నిత్యము, అనన్యము అగునో అట్టి స్నేహము భక్తియగునని" శ్రీమధ్వాచార్యులభిప్రాయ పడ్డారు. "ఆర్ద్రీభూతమగు హృదయమందు బింబితమై, నిశ్చలముగ నిలచిన భగవద్రూపము వంక భావమును నిరంతరము ప్రవహింపజేయుటయే భక్తి"- అని శ్రీ మధుసూదన సరస్వతుల ఉద్దేశ్యం. "జ్ఞాన కర్మ రూపావరణములను తొలగించి అనన్య కాంక్షారూపముగా భగవదనుభూతిని పొందుట భక్తి" అని శ్రీ రూపగోస్వాములూ పలికారు. "ప్రేమ ద్వారా లేదా ప్రపత్తి (శరణాగతి) ద్వారా భగవదైక్యము నొందుటే భక్తియోగమని" శ్రీరామకృష్ణ పరమహంస సందేశం. ఈ నిర్వచనాలన్నిటినీ దృష్టిలో ఉంచుకొని యోచిస్తే భక్తి స్వరూపం గోచరమవుతుంది. భగవంతుని పట్ల సామాన్య మానవునికి ఏర్పడే అనిర్వచనీయ నిరుపమ రక్తే భక్తి అని భావించవచ్చు.

3. 1. భక్తిని పలువురు పలురకాలుగా వర్గీకరించారు. సత్త్వరజస్తమోగుణ భేదాల్ని బట్టిగానీ; ఆర్త, జిజ్ఞాస, అర్థార్థి అని మనస్తత్వ భేదాల్ని బట్టిగానీ భక్తిని మూడు విధాలుగా వర్గీకరించ వచ్చునని విజ్ఞులభిప్రాయపడ్డారు. ఈ భక్తి ముఖ్యంగా శాంతి, దాస్య, సఖ్య, వాత్సల్య, మధుర భావాలనే పంచ విధ సాధనల ద్వారా అనుభూతమై, పంచవిధ రూపాలతో అభివ్యక్త మవుతున్నట్లు విజ్ఞాన సర్వస్వకి వివరిస్తూ ఉంది.

### 3. 1. 1. శాంత భక్తి :

పరాభక్తి ప్రప్రథమ స్వరూపం, బ్రహ్మైక్య జ్ఞాన రసానుభవ రూపకమయిన స్వాస్థ్యస్థితే శాంతభక్తి. ఇది కేవలం ఆత్మనిష్ఠ అంతర్ముఖిత. కేవల నివృత్తి పరాయణుడై, విషయ నిస్పృహుడై భగవంతుని ఆత్మగా గ్రహించి, సర్వథా అభిన్నుడై సమదర్శుడై అనన్యభావంతో ప్రేమిస్తూ అద్వైతానంద నిమగ్నుడు కావడమే శాంత కికి పరాకాష్ఠ. సనక. సనందన సనత్కుమారాదులీ భక్తికి ఆదర్శ మూర్తులు.

### 3. 1. 2. దాస్యభక్తి :

భక్తుడు తాను భగవత్సేవకుడని సంభావించడమే దాస్యభక్తి. శ్రద్ధాయుక్తుడయిన సేవకునికి తన ప్రభువు మీద ఉండే అనురాగం దాస్య భక్తునికి ఆదర్శం. ధ్రువ, ప్రహ్లాద, అంబరీష హనుమదాదులు ఆదర్శ దాస్య భక్తులు.

**3.1.3. సఖ్యభక్తి :**

పరమేశ్వరుని తన ప్రాణ మిత్రునిగా ఆరాధించే ఉపాసనమే సఖ్యభక్తి సుగ్రీవ, సుదామ, భీష్మార్జునోద్ధవాది దివ్యపురుషులు సఖ్యభక్తికి ఆదర్శప్రాయులు.

**3.1.4. వాత్సల్య భక్తి :**

భగవంతుని పుత్రభావంతో ప్రేమించడమే వాత్సల్య భక్తి. వల్లభాచార్య నంద యశోదాదులు ఆదర్శ వాత్సల్య భక్తులు.

**3.1.5. మధుర భక్తి :**

భగవంతుని తన ప్రాణనాధునిగా ఎంచే మహాభావమే మధురభక్తి. రాధాదేవి గోపికలు, జయదేవ, చండీదాస, చైతన్యాదులే ఉజ్వల మధుర భక్తికి ఆదర్శమూర్తులు

3. 2 గుణమహాత్మ్యాసక్తి, రూపాసక్తి, పూజాసక్తి, స్మరణాసక్తి దాస్యాసక్తి సఖ్యాసక్తి, కాంతాసక్తి, వాత్సల్యాసక్తి, ఆత్మనివేదనాసక్తి. తన్మయతాసక్తి, పరమ విరహాసక్తి అను పదకొండు విధాల భక్తిని నారదులవారు ప్రతిపాదించారు.

3.3. సుప్రసిద్ధ వాగ్గేయ కారుడయిన అన్నమయ్య కూడా పలు భక్తి రకాల్ని పేర్కొన్నాడు.

"నానా భక్తులివి నరులమార్గములు
యే నెపాననైనా నాతడియ్యకొను భక్తి ॥పల్లవి॥
హరికిగా వాదించుటది ఉన్మాదభక్తి
పరుల గొలువ కుండే పతివ్రతాభక్తి
అరసి యాత్మ గనుటదియే విజ్ఞానభక్తి
ఆరమరచి చొక్కుచే ఆనందభక్తి ॥నానా॥
అతిసాహసాల పూజ ఆది రాక్షసభక్తి
అతని దాసుల సేవే అదియే తురీయభక్తి
క్షితినొకపని గోరి చేసుటే తామసభక్తి

అతడే గతని వుండుటది వైరాగ్యభక్తి ॥నానా॥
అట్టె స్వతంత్రుడౌటే అది రాజసభక్తి
నెట్టన శరణమంటే నిర్మలభక్తి
గట్టిగా శ్రీవేంకటేశు కైంకర్యమే సేసి
తట్టుముట్టు లేనిదే తగ నిజభక్తి".1 ॥నానా॥

3.4. భాగవతం కూడా నవవిధ భక్తుల్ని ప్రతిపాదించింది.

"శ్రవణం కీర్తనం విష్ణోస్మరణం పాదసేవనమ్
అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మ నివేదనమ్" 2

3.5. సోమన తన కావ్యంలో అన్నిటికీ చోటివ్వలేకపోయినా నవవిధ భక్తుల్లో కొన్నిటికి మాత్రం స్థానం కల్పించి ఉన్నాడు. వాటిని ఆయా చోట్లల్లో పరిశీలించవచ్చు.

## 3.5.1. కీర్తనం :

కీర్తించడం అంటే కొనియాడడం, స్తుతించడం, భగవత్కీర్తిని, అతని మహా మహిమోపేతాలయిన లీలల్ని, అనంత కల్యాణ గుణాల్ని ఆశదీర కీర్తించడమే కీర్తనా భక్తి అని చెప్పుకోవచ్చు. ఉత్తర హరివంశకావ్యంలో దేవతలయిన శివకేశవులు మహా పురుషులు చోటుచేసికొన్నారు. వీరిని కీర్తిస్తూ ఇతర పాత్రలచేత చెప్పించిన పద్యాలు కీర్తనా భక్తికి తావలాలు కృష్ణుని పట్ల బదరికాశ్రమ ఋషులు, దేవేంద్రుడు, [illegible] అర్జునుడు ఘంటాకర్ణుడు, నారదుడు, జనార్దనుడు, సిద్ధ సాధ్య గంధర్వ [illegible], శైవజ్వరంఋషుల పట్ల శైనేయ కృష్ణులు కీర్తనా భక్తిని ప్రదర్శించారు శివుని పట్ల శ్రీకృష్ణుడు బాణాసురుడు తమకీర్తనా భక్తిని వెల్లడించారు. [illegible] నాచన సోమన సయితం శివునిపట్ల తనకుగల కీర్తనా భక్తిని ప్రదర్శించారు.

---

1. అన్నమాచార్యుడు, తాళ్ళపాక. - ఆధ్యాత్మ సంకీర్తనలు సంపుటం - [illegible] కీర్తన-469.
2. వేదవ్యాసుడు - శ్రీ మద్భాగవతము - సప్తమ స్కంధము - అధ్యాయం [illegible] శ్లోకం - 23.

**3. 5. 2. స్మరణం :**

స్మరణమంటే తలపోయడం. భగవంతుని లీలల్ని భావించి పరవశించడమే స్మరణ భక్తి ప్రధాన లక్షణం. ఇది సమాధిస్థితికి తీసికొని వెళ్ళడంవల్ల మహోత్కృష్ట మయిందని మహనీయులు చెబుతారు. దీనికికూడా నాచన సోమన తన కావ్యంలో చోటు కల్పించాడు. కృష్ణునిపట్ల అర్జునుడు, జనార్దనుడూ, ధర్మరాజాదులు ప్రదర్శించిన స్మరణభక్తి, శివునిపట్ల శ్రీకృష్ణహంసడిభకులు కనబరిచిన స్మరణభక్తి మనకు కనిపిస్తుంది.

**3. 5. 3. పాదసేవనం :**

త్రికరణ శుద్ధితో భగవత్పాదాలను సేవిస్తూ జీవనయాత్ర సాగించడమే పాద సేవన భక్తి అని అభిజ్ఞుల అభిప్రాయం. కృష్ణుని దర్శించిన దుర్వాసుడు అతన్ని సేవించడంలో తనకుగల అభిలాషను వ్యక్తం చేశాడు కృష్ణపాదసేవనాసక్తుడయిన అతడు ప్రదర్శించినభక్తి పాదసేవన భక్తి అనే పేర్కొన దగి ఉంది.

**3.5.4. వందనం :**

భగవంతునికి నమస్కరించడమే వందనభక్తి ప్రధాన లక్షణం. మోకరిల్లడం. సాష్టాంగదండ ప్రణామం చేయడం, నతశిరస్కులు కావడం మొదలయినవి వందన భక్తి పరిధిలోకే వస్తాయి. కృష్ణునిపట్ల బదరికాశ్రమ ఋషులు, ఈశ్వరుడు, దుర్వాసుడు వందన భక్తిని ప్రదర్శించినట్టు సోమన పేర్కొని ఉన్నాడు.

**3 5.5. సఖ్యం :**

భగవంతుని మిత్రునిగా భావించి కష్టసుఖాల్లో అతనికి భాగమిచ్చి పుచ్చుకోవడం సఖ్యభక్తితత్త్వమని చెప్పుకోవచ్చు నష్టపుత్రకుడయిన బ్రాహ్మణుని వృత్తాంతంలోనే కృష్ణార్జునుల్ని ఒకేసారి సోమన మనకుదర్శింపజేశాడు. కృష్ణుని పేర్లలో నరసఖుడనే ప్రసిద్ధనామం కూడా ఉంది. దీన్ని బట్టి నరుడయిన అర్జునుడు, నారాయణుడు ఎంతో సఖ్యతతో ఉన్నట్టు తెలుస్తూ ఉంది. కానీ కృష్ణునిపట్ల ఎనలేని భక్తి ప్రపత్తులు గల సోమన మనసుకు అదినచ్చలేదు కాబోలు. అర్జునుని పాత్రచిత్రణలో చాలా మెరుకువ ప్రదర్శించాడు. కృష్ణునిఎడ అర్జునునికి భగవద్భావమే కానీ సఖ్య భావమెక్కడా కన్పించదు.

### 3. 3. 6. ఆత్మ నివేదనం :

కష్ట సమయాల్లో కుంగక, సుఖం ప్రాప్తించినప్పుడు పొంగక తనను భగవంతునికి సమర్పించుకొని తనను రక్షించే బాధ్యతను అతనికప్పగించి నిశ్చింతగా ఉండడమే ఆత్మనివేదనమని ఆర్యోక్తి దీన్నే శరణాగతి అని కూడా అంటారు ఇది మనోపరిపక్వం గలవారికి మాత్రమే సాధ్యమవుతుంది. కృష్ణోపదిష్ట మంత్ర లబ్ధుడయిన అర్జునుడు సర్వాత్మనా అతనినాశ్రయించినట్టు చెప్పుకొన్నాడు. ఇది కృష్ణునికి తన ఆత్మను నివేదించుకొన్నట్టే అవుతుంది.

నవవిధ భక్తులన్నిటినీ తలవకపోయినా సోమన కొన్నిటిని మాత్రం తెన్నుగా స్పృశించాడు. ఏయేపట్టున ఏయే పాత్రలచేత ఎవరెవరిపట్ల భక్తిభావాన్ని ఎలా ప్రదర్శింప జేశాడో పరిశీలించ వలసి ఉంది.

### 3. 4. కృష్ణునిపట్ల ఇతరులు ప్రదర్శించిన భక్తి :

ఉత్తర హరివంశంలో కృష్ణుడే నాయకుడని చెప్పదగి ఉంది సోమన అతన్ని సర్వశక్తి సంపన్నునిగా, సర్వలోకారాధ్యునిగా, సమస్తాధికునిగా, దుష్టశిక్షణ శిష్ట రక్షణాదక్షునిగా, కరుణామయునిగా తీర్చిదిద్దాడు. దేవశ్రేష్ఠుడయిన కృష్ణుణ్ణి ఉత్తర హరివంశంలోని తక్కిన పాత్రలు కొన్ని కొనియాడాయి. కొన్ని తెగడాయి. తెగడినవి తెగటార్చబడ్డాయి ప్రశంసనీయ ప్రతిపత్తి పొందాయి. శ్రీకృష్ణుని పట్ల పలువురు పలువిధాలుగా భక్తిభావాన్ని ప్రదర్శించి సత్ఫల సంపన్నులయ్యారు.

### 3.4.4. బదరికాశ్రమ ఋషులభక్తి :

యాగహవిర్భాగాన్నిమ్మని నరకాసురుడు బదరికాశ్రమ ఋషుల్ని బాధించాడు. అతని అనుచరులు ఋషుల్ని పలువిధాలుగా పరాభవించారు. ఋషికన్యల్ని చెర బట్టారు. ఋషుల సాధనాల్ని భగ్నం చేశారు వారికాందోళన కలిగించారు. అశాంతి రేకెత్తించారు. ఋషులు అవమానంతోనూ ఆగ్రహంతోనూ చీకాకుపడ్డారు. ప్రతీకారం ఆలోచించారు. సుధర్మ సౌధమే వారికి గోచరించింది. కృష్ణుడే శరణ్యమని తోచింది. మాధవుని సందర్శించాలనే కుతూహలం త్వరపెట్టింది. ద్వారక చేరుకొన్నారు. కృష్ణుని సభలో ప్రవేశించారు. అతని చేత సత్కృతులయ్యారు. వారి అనందానికి

అవధులే తేక పోయాయి భక్తిపారవశ్యంతో కృష్ణునికి నమస్కరించారు. అతని గరిమను కీర్తించారు. ఇక్కడ సోమన తన పాండిత్యం ప్రదర్శించడమే గాక కృష్ణుని విష్ణువుగా భావించి అతని గొప్పతనాన్ని కొనియాడినతీరు రమణీయంగా ఋషులు చెప్పినట్టు రచించిన పద్యంలో చోటు చేసుకొంది.

" సీ. పన్నగంబుల రాజుఁబగవాఁడుఁగూడి నీ
శయనంబుఁబయనంబు సంతరింప
దుగ్ధవారాశి కూఁతురు నాలుఁగూడి నీ
శరణంబుఁజరణంబు సవదరింపఁ
దామర పగవాఁడు దయితుండుఁగూడి నీ
బడి చూపుఁగుడి చూపుఁబరిఢవింపఁ
జందురు చెలికాఁడు సయిదోడు గూడి నీ
యుల్లంబు మొల్లంబు నుపచరింపఁ

తే. గంపమాన మనోధ్యానగతులు మాన
కేకతంబున్న మునులకు నేకతంబు
లేకపాడగాన వచ్చు నీ లీల గాన
నన్యులేనాట ధన్యులే యంబుజాక్ష. " [3]

గీ. "అనుచుఁగొనియాడి వందన మాచరించి
మునులు సంతోష వార్ధిని మునిఁగి యాడఁ
గొలువునందున్న యాసవకోటి యెల్ల
మొగువుఁ గేలు ఫాలంబున మోచియుండె." [4]

---

3. ఉత్తర హరివంశము 1-119
4. ఉత్తర హరివంశము. 1-120

క. "నీవారము నీవిచ్చితి
నీవారము మాకు భోగనియత సుఖంబుల్
గావింపుము మా ప్రియములు
గావింపుము నీవు భక్తిగమ్య మురారీ"6

3.4.2. దేవేంద్రుని భక్తి :

ఋషులకువలె దేవేంద్రునికి సయితం నరకాసురుడు ఎగ్గుచేశాడు ఘోర యుద్ధంలో ఓడించి అతని సంపదల్ని దోచుకొన్నాడు. దేవాంగనల్ని చెరబట్టి తెచ్చాడు. దేవమాత కర్ణకుండలాల్ని, వరుణ ఛత్రాన్ని మురాసురునిద్వారా అపహరించాడు. దేవేంద్రునిలో అవమానాగ్ని ప్రజ్వరిల్లింది. నరకుడు ఇంతటితో పోక మరల కూడా కీడు చేస్తాడేమో అనే సందేహం కలిగింది దిక్కుతోచలేదు. కృష్ణుడే దిక్కనిపించింది. అమరావతినుండి ద్వారవతికి వచ్చాడు కృష్ణుని సందర్శించి ఉచితాలాపాలాడి ప్రసన్నుని చేసుకొన్నాడు. అతనికి దుస్సాధ్యమైనపనీ లేదని కీర్తించాడు. నరకుని బారినుండి తనను కాపాడుమని వేడుకొన్నాడు ఆ సందర్భంలో అతడు చెప్పిన రెండు కందపద్యాలు అందంగా ఉండడమేగాక పాఠకుల డెందాన్ని సయితం స్పృశించ గలుగుతాయి.

క॥ "ఇటమీఁద నాకు నరకుఁడు
కుటిలమతిం గీడు చేయఁగోరెడు నతనిం
జటులతర చక్రధారా
త్రుటితశిరఃకమలుఁ జేయు తోయజనాభా"7

క. "ఈవైన తేయు నెక్కినఁ
గావింపఁగ రాని పనులుఁగలవే నీకున్

---

7. ఉత్తరహరి వంశము 1-135

గోవింద! తిరుగు నీతఁతడు
దేవతలకుఁ దిరుగ రాని తెరువున నైనన్"[8]

దేవేంద్రుడు తక్కిన దిక్పాలకులచేత కూడా పనిచేయించుకోగల పాలకుడు. అట్టివాడు సపరివారంగా నరకునకోడి కష్టాల పాలయ్యాడు. కృష్ణుణ్ణి ఆశ్రయించాడు. ఇక్కడ కృష్ణాధిక్యత, దేవేంద్రుని అసమర్థతాజనిత భక్తి తేటపడుతున్నాయి.

3. 4. 3. భూదేవి భక్తి :

నరకుడు మరణించాడు. తల్లిహృదయం తల్లడిల్లింది. వసుంధర వారిజాక్షిగా నిలబడింది. నరకుని కుమారుణ్ణి కాపాడడానికి ఆయత్తమయింది. అదితికుండలాల్ని తెచ్చి సమర్పించింది. కృష్ణుని నిష్పక్షపాతాన్ని కొనియాడింది. తన కుమారుని కాపాడలేక పోయినందుకు మెల్లగా నిందించింది. ఈమె తన భర్తఅయిన విష్ణువే కృష్ణుడని భావించి కీర్తించడం గమనించదగి ఉంది.

గీ. "శత్రులకుఁబుత్రులకు నొక్క చందమగుట
పెద్దలకు మంచిగుణమని పేరు కొనఁగ
సకల దానవ సంఘంబుఁజంపినట్లు
కొడుకుఁజంపితి మునికోటి కోర్కి దీర్ప."[9]

క. "అట్టేల జగము లన్నియుఁ
బుట్టింపం బెంపఁ ద్రుంపఁ బురుషులు మువురై
పుట్టిన వేలు పవఁట నా
పట్టి వొడం దగునె నడిమిపని మానుటకున్."[10]

క్షమకు మారు పేరైన భూదేవి పుత్ర శోకంతో పొగలడం, మధ్యపని మానేశావెందుకని నిలదీసి అడగటం స్త్రీ స్వభావ సిద్ధంగానే ఉన్నాయి. "పుట్టింపం బెంపఁ

8. ఉత్తర హరివంశము 1-136
9. ఉత్తర హరివంశము 1-185
10. ,, 1-186

ద్రుంపఁబురుషులు ముగురై పుట్టిన వేలు పవసీ" కృష్ణుని మూర్తిత్రయాత్మకునిగా కొనియాడటం ఆమెభక్తికి, వాస్తవిక దృష్టికి తార్కాణమని చెప్పవచ్చు

3.4.4. ఘంటాకర్ణుని భక్తి :

ఘంటాకర్ణుడు పిశాచవల్లభుడు. అయినా విష్ణుభక్తి సంపన్నుడు విష్ణువు గొప్పతనంతో ఆకర్షింపబడినవాడు కాబట్టి ప్రతిదినమూ అతని రూపాన్ని ధ్యానిస్తూ కీర్తిస్తుంటాడు. అందువల్ల గతకల్మషడవుతాడని అతని అచంచల విశ్వాసం. కృష్ణుని గొప్పదనాన్నే గాక కృష్ణుని రూపాన్ని సయితం కళ్లకుగట్టినట్టు వర్ణించాడు.

సీ॥ "తొమ్మండ్రు కొడుకులఁదొలి వేలుపులఁ జేయఁ
బొడమించు నేదేవు బొడ్డుఁదమ్మి
మూఁడు త్రోవలఁ బాఱి మున్నీటిఁగరిత గాఁ
బరఁగు నేదేవుని పాదతటిని
పండ్రెండు రూపులై పగలింటిరాజుగా
వలతి యేదేవుని వలనుఁగన్ను
వేయి మానికపు దివ్వెలతోడఁ బడగలు
ద్రాల్చు నేదేవుని మలకపాన్పు

తే॥ మునులకెల్ల నేదేవుని మూర్తి వెలుఁగు
హృదయ గేయంబులో దీప మెత్తినట్లు
హరిమురారిన ద్దేవు మహానుభావు
మనసులోఁగంటి భవములు మానునంటి."[11]

సీ. "పుండరీకములతోఁ బురణించు కన్నులఁ
గారుణ్యమను తేనె కడలు కొనఁగఁ
మందారశాఖతో మఱయఁ జాలెడు కేలఁ
బాంచజన్యంబను పండు మెఱయ

11. ఉత్తర హరివంశము 2-144

నాచనసోమన భక్తితత్త్వం

నుదయాద్రి తటముతో నుద్దించు నరమునః
గౌస్తుభం బనుదివాకరుఁడు తోఁడ
నాకలోకంబుతో నవ్వు పాదంబున
నాకాశనది యను నమృత మొప్ప

తే. నమృత ధారాధరము మాటలాడినట్లు
భాగ్యదేవత రూపు చేపట్టినట్లు
లలితగతి నున్న సద్గుణాలంకరిష్ణు
విష్ణుఁబొడగంటి భవముల విడుకొంటి''.12

పిశాచాల్ని సయితం ఆకట్టుకొనగల ఆధిక్యత, సౌజన్యం కృష్ణునిలో ఉన్నాయని ... వల్ల వ్యక్త మవుతూ ఉంది.

3.4.5. శివుని భక్తి

కృష్ణుడు శివు నుద్దేశించి పుత్రార్థి అయి కైలాసానికి వెళ్ళి తపస్సు చేశాడు. తపస్సు ఫలించింది. సపరివారంగా సాంబుడు ప్రత్యక్షమయ్యాడు. ... వందనానంతరం కృష్ణ మాహాత్మ్యాన్ని గిరిజాపతి కీర్తించాడు. ఈ స్తుతి శివుడు చేసిందిగాక సోమన చేసినట్లే మిక్కిలి హృద్యంగా ఉంది. ఇక్కడ సోమన వ్యక్తిత్వం మనకు ద్యోతక మవుతుంది. సంస్కృత రచనలోనూ తాను ... సోమన చెప్పక చెబుతున్నాడు.

సీ. ''ప్రణుతింతు నోన్నమో భగవతే వాసుదే
వాయ నమో భక్తవత్సలాయ
సూర్యాత్మనే నమస్సోమాత్మనే నమః
ప్రణవాత్మనే నమో బ్రహ్మణే న
మో రుద్రనామ్నే నమో విష్ణవే నమో
మూలప్రకృతయే నమో వసుంధ

12. ఉత్తర హరివంశము 2-146

రాది భూతగణానుహారి భాసే నమో
మాయామయాయ నమస్సహస్ర

తే॥ బాహునేత్రశిరః పాదవస్త్రయేన
మోనవపట్స్వధా స్వాహాత్మ మూర్తయే న
మః స్వభావ శుద్ధాయనమః ప్రహరణ
ధారిణేనమో యనుచు నుదహరింతు."[13]

ఈశ్వరుడు త్రిమూర్తుల్లో ఒకడు. విష్ణుసమానుడు. దేవేంద్రాది దిక్పాలాధిపుడు. అయినా అతని ద్వారా కృష్ణుని కీర్తింప జేయడం శివుని వినయాన్నేగాక కృష్ణాధిక్యతను వెల్లడిచేసే సోమన ప్రయత్నానికి స్పష్టోదాహరణ మనవచ్చు.

### 3.4.6. అర్జున ధర్మరాజాదుల భక్తి :

కృష్ణానుమతంతో పార్థుడు విప్రుని ఇంటికి వెళ్లాడు. కర్తవ్యపాలనలో అప్రమత్తుడయి ఉన్నాడు. ఆసమయంలోనూ కృష్ణపదాంభోజాల్ని మనస్సులో నిల్పి స్మరిస్తుండడం అతని స్మరణభక్తికి తార్కాణం.

మ. "యదువృష్ణ్యంధక భోజసైన్యములతో నభ్రంకషారావభి
న్న దిగంత ద్వీపమండలుండనయి కృష్ణశ్రీపదాంభోజముల్
మదిలో నిల్పి మహాసురావనధరమ్యగ్రామ మధ్యంబునం
బడిలుండైతిఁ బ్రసూతివేళ యమునిం బ్రత్యర్థిఁ గాఁ జూచుచున్".[14]

కృష్ణుడు అర్జునునికి మిక్కిలి గోపనీయమయిన మంత్రోపదేశం చేశాడు. అర్జునుడత్యంత ఆనంద పరవశుడయ్యాడు. ఆవిషయాన్ని ధర్మరాజాదులకు చెబుతూ తానప్పటినుండీ అహర్నిశాలూ ఘోరదుర్దశలుమట్టినా సంపదమిన్నుముట్టినా కృష్ణుణ్ణి ఆశ్రయించే ఉంటానని తెలియ జేశాడు.

---

13. ఉత్తర హరివంశము 2-218
14. ఉత్తరహరివంశము 2-23

చ. "అని పరమోపదేశముగ నానతియిచ్చిన యంత నుండియు
స్వనజదళాక్షు భక్తజన వత్సలు వేదశిఖావతంస పా
వన పదపల్లవుం డిదిశ వల్లభ సేవితు నాశ్రయింతు నా
మనమున ఘోరదుర్దశలుమట్టిన సంపద మిన్నుముట్టినన్".15

ఇక్కడ అర్జునుని సుఖదుఃఖ నిగ్రహ్యం. శరణాగతి తత్త్వం, ఆత్మనివేదన వ్యక్తమవుతున్నాయి.

ధర్మరాజాదులు అర్జునుని వల్ల కృష్ణుని అత్యద్భుతకర కృత్యాల్ని విన్నారు. అతని అతిమానుష చేష్టలు వారి నాకర్షించాయి. మనసు భక్తిరస పరిప్లావితమయింది. అతన్ని సంస్మరించి అతనిపట్ల తమకుగల భక్తి ప్రపత్తుల్ని ఆవిష్కరించుకొన్నారు.

క॥ "అనవిని ధర్మతనూజుండు
జనపతులను గృష్ణుంజిత్త సరసీరుహములం
దునిచి పులకాంకురమ్ములు
మొనయంగ నానంద బాష్పములు నెడలంగన్."16

శ్రీకృష్ణలీలలు స్వయంగా కన్నవారినే గాక విన్నవారిని కూడా సముత్తేజపరుస్తాయి సంతోషమగ్నుల్ని జేస్తాయి. భక్తిభావన్ని కూడా జనింప జేస్తాయని సోమన ఈ ఘట్టం కల్పించడం ద్వారా చెప్పక చెప్పినట్టయింది.

### 3.4.7. నారదుని భక్తి :

దేవర్షి నారదుడు పుండ్ర దేశానికి వచ్చాడు. పౌండ్రకుని వల్ల సత్కారం పొందాడు. పౌండ్రకుడు దురహంకారి అయి తన ఆధిక్యతను చాటుకొంటూ కృష్ణుడు తనతో సాటి రాదన్నాడు. కృష్ణుణ్ణి నకిలీ వాసుదేవుడని అపహసించాడు. పౌండ్రకుని దురహంకారం కృష్ణభక్తుడయిన నారదునికి గిట్టలేదు. పౌండ్రకుని పలుకలు మలుకు

15. ఉత్తర హరివంశము 2-60
16. ఉత్తర హరివంశము 2-61

లయి తాకాయి. నారదుని హృదంతరాళం నుండి సాధిక్షేప వాక్యాలు వెలువడ్డాయి. కృష్ణుని పొగడుతూ పౌండ్రకుని తెగడతూ నారదుడు ప్రసంగించాడు.

చ. "మనమున నోకిలించి మఱుమాటలఁ గింకిరిపాటు తోడుగా
మునిపతి యల్ల నవ్వి విను మూర్ఖ మురాంతకుఁ బుండరీకలో
చనుఁ ద్రిజగన్నుతున్ సుగుణ సాగరుఁ జేరవు గాక శార్ఙ్గితో
బెనఁగుట మంటలో మిడుత బీరము సూపుటగాదె దుర్మతీ" 17

పౌండ్రకుడు దుర్మదాంధుడు. దురహంకారి. పుండ్రభూపతి. అతననుకుంటే నారదుణ్ణి ఎలాంటి శిక్షకైనా గురిచేసే అధికారం గలవాడు. అయినా నారదుడు అతనికి ఇష్టంలేని మాటలాడాడు. నారదుని కృష్ణభక్తి రాజువల్ల ప్రమాదాన్ని సయితం గుర్తించనీయక అతన్ని అలా మాట్లాడించింది. నారదుడు దేవర్షి అయినా సంయమనం కోల్పోయి ఇలా మాట్లాడటం మానవ స్వభావ సహజంగా ఉంది. నారదుడు గాక నారదుని ముఖతహ సోమనే అలా మాట్లాడాడనిపిస్తుంది.

### 3. 4. 8. దుర్వాసుని భక్తి :

హంసడిభకులు వేటకు వెళ్లి దుర్వాసుని చూశారు. దురాలాపాలాడారు. అతడు సహజ కోపాన్ని దిగమింగుకొని సవ్యంగా సమాధానం చెప్పాడు. అయినా దుర్మతులయిన హంసడిభకుల కతని మాటలు రుచింపలేదు. అతడుచెప్పే మంచిమాటలన్నీ వారికి ఈటెల పోటులుగా తోచాయి. వారు ఆగ్రహించారు. దుర్వాసుని కఠినంగా నిందించారు. ఆతనికాషాయాన్ని చించి ఇతర సాధన సామగ్రిని పాడుచేశారు. శాపాయుధుడయినా దుర్వాసుడు చేయగలిగింది లేక ద్వారక చేరుకున్నాడు. శ్రీకృష్ణునివల్ల సత్కారం పొంది ఉచితాసనాసీనుడయ్యాడు. శ్రీకృష్ణుడు దుర్వాసుని రాకకు కారణమడిగాడు దుర్వాసుడు కృష్ణునిగొప్పతనాన్నంతా కొనియాడి అటువంటివానికి తమ రాకకు కారణం తెలియక పోవడం ఆశ్చర్యమన్నాడు. ఆరు పద్యాల్లో కృష్ణుని కీర్తించాడు.(4-91 నుండి 96 వరకు) సర్వజ్ఞుడయిన కృష్ణుడు తమసంగతి తెలియనట్లు నటించడం తమ దురదృష్టంవల్లనే అనుకొన్నాడు.

---

17. ఉత్తర హరివంశము. 3-14

సీ॥ "ఏ నెఱుంగుదు నిన్ను నేల నాతోఁ డనే
వెడమాయముల బ్రహ్మవేత్త లెఱుఁగు
రూపు రూపులలోని రూపుఁదోరపు రూపు
చూపనిరూపు నీరూపు నూపి
వేదాంతముల నైన వెదక నందని రూపు
విజ్ఞాన రూపమై వెలయు రూపు
తేజమైశ్వర్యంబుఁ దెలుప జాలెడు రూపు
ప్రణవ రూపంబుగాఁ బరఁగు రూపు

తే. పంచ భూత సుధాకర భాస్కరాత్మ
రూప మగురూపు నీ రూపు రుచిరరూప
మొఱఁగెదవె మాకు వ్రేల్లతో మొదలు చూచి
చెట్టెఱుగు వారి కారులు సిమునేల." 18

క. "మాకుం బుణ్యము చాలమిఁ
గాకేమి జగత్త్రయంబు గానం బ్రోవం
గైకొన్న నీవు నకలవి
వేకివి మా దుఃఖ మెఱుఁగవే మధుమథనా" 19

దుర్వాసుడు కష్టాల్లో సయితం కృష్ణుని కీర్తించడం, నివారణకోసం అతన్ని ప్రసన్నుని చేసుకోడానికి ప్రయత్నించడం కృష్ణునిపట్ల అతనికి గల భక్తికి తార్కాణాలు.

3.4.9. జనార్దనుని భక్తి :

హంసడిభకులు రాజసూయాధ్వరం చేయడంకోసం తండ్రి బ్రహ్మదత్తుని ఒప్పించారు, లవణం కప్పంగా అడుగవలసిందనీ శ్రీకృష్ణుని యుజ్ఞసమయానికి

18. ఉత్తరహరివంశము. 4-95

19. ఉత్తర హరివంశము. 4-96

రమ్మనవలసిందనీ జనార్దనుణ్ణి జనార్దనుని కడకు రాయబారం పంపారు. జనార్దనుడు చెప్పిన హితోక్తులు హంసడిభకులకు రుచించలేదు అతనికి ద్వారవతికి వెళ్ళడం తప్పలేదు. హయారూఢుడై వారిని వీడ్కొని వెళ్ళే సమయంలో అతని మనసు ఆనందతరంగాల్లో ఓలలాడింది. మాధవదర్శనభాగ్యం తనకు లభించడం మహా అదృష్టమని జనార్దనుడు భావించాడు కృష్ణుని గూర్చి పరిపరివిధాల తలపోశాడు. భగవంతుడయిన యదూద్వహుని స్మరించడం వల్ల ఇతడు స్మరణ భక్తిని ప్రదర్శించినట్టయింది.

సీ. "యదుకులాంబుధి చంద్రము నానందమునఁ జూచు
రామాదిహిత చకోరములలోన
దనుజారి పారిజాతముఁ జేరి పొదిగొన్న
రాజన్య రాజకీరములలోన
వసుదేవ సుత సరోవరములో నోలాడు
సనకాది దివ్య హంసములలోన
గోపాల నవ పుష్ప గుచ్ఛంబు మూఁగిన
పరిచారికా ద్విరేఫములలోనఁ

తే. గలయఁ దొలుబాము నోములు గలవు గాన
సెలవు లేక జన్మంబులు చెడియెనాకు
మీఁద జన్మంబులు గలుగ నిర్మించెనేని
కమలజుని పేర దాపటి కాల బొమ్మ" 20

రాజసూయాధ్వరం చేయవద్దని వారిస్తూ హంసడిభకులకు కృష్ణుని వీర విహారాన్ని గురించి చెప్పే సందర్భంలోనూ, యదూద్వహుని కొలువులో అతన్ని కొనియాడేటప్పుడూ స్వస్థానానికి తిరిగివచ్చి కృష్ణుని చూశానని చెప్పే సందర్భంలోనూ జనార్దనుని కృష్ణకీర్తనం అయిదు పద్యాల్లో (4-122 నుండి 128 వరకు) చోటుచేసుకొంది

20. ఉత్తర హరివంశము. 4-137

ఈ పద్యాలన్నీ మనోహరాలై అలరారు తున్నాయి. మచ్చుకు ఒకటి పరిశీలించడం సమంజసం.

సీ. "నరకాసుర ప్రాణ నాళో త్తరణకేళి
రణకేళి వలకేళి రమణఁజూపె
గంసదానవ శిరః కమల కృత్తన మేలు
తన మేలు చేయి పెద్దలకు నొసఁగఁ
జాణూర ముష్టికక్షతజ కీలాలంబు
నాలంబులో నెల్ల నలవు వఱపె
మురహయగ్రీవాంత్ర మూల ఫేనావలి
నావలిదలఁగఁ జీకాకు పఱచె

తే. వీరరససార కాసార విహరణంబు
విష్ణునకు నొప్పు నతనితో విగ్రహింప
దొరకొనిన వచ్చు మనకు మద్దులు మునింగి
పాఱ వెంపల్లు తమ కెంత బంటి యనుట" 21

రాజసూయయాగం చేసేసమయంలో హంసడిభకులకు కృష్ణునితో వైరం తప్పదనీ, కృష్ణునితో యుద్ధంలో గెలవడందుస్సాధ్యమనీ జనార్దనుడు రాకుమారులకు తెలియ జేశాడు. ఆ సందర్భంలో రచింపబడిన పైపద్యం కృష్ణుని వీరవిహారానికి దర్పణం పట్టింది. తన ప్రభువుల దగ్గరే వారికి గిట్టని వాసుదేవుని జనార్దనుడు శ్లాఘించడం మాధవునిపట్ల అతనికి గల భక్తి తీవ్రతకు చక్కటి నిదర్శనం.

### 3. 4. 10. పుష్కర సరస్తీరస్థ ఋషుల భక్తి :

హంసడిభక వధానంతరం యశోదా నందుల పరితుష్టుల జేసి వారిని పిల్చుకొని కృష్ణుడు పుష్కర సరస్తీరం చేరాడు. అక్కడి ఋషులు అతని కర్ఘ్యపాద్యాదులిచ్చి

21. ఉత్తర హరివంశము. 4-124

సత్కరించారు. విచక్రుని, హంసడిభకుల్ని వధించినందుకు మిక్కిలి ప్రసంశించారు అతన్ని నారాయణునిగా గుర్తించి కీర్తించాడు.

సీ. చక్రంబు మేదినీ చక్రంబు నేదేవు
దక్షిణ బాహు సౌందర్య మొసగు
జలజంబు నొకపాణి జలజంబు నేదేవు
సవ్య భుజంబుతో సరసమాడు
రత్నంబుఁగామినీ రత్నంబు నేదేవు
వక్షస్థ్సలంబున వన్నె మిగులు
నోఘంబు దానవారోఘంబు నేదేవు
చరణ పల్లవ సమాశ్రయము నొందు

తే. భాను మండలమును సుధాభాను మండ
లంబు నేదేవు కన్నుల లావు వడయు
దేవదేవు నద్దేవునిఁ దెలియువారు
దేవ దేవుని రూపంబుఁదెలియువారు. [22]

3.4.11. సిద్ధ సాధ్య చారణ గంధర్వుల భక్తి :

అనిరుద్ధుడు అపహృతుడయ్యాడు. అందరికీ ఆందోళన హెచ్చింది. చారులు రిక్తహస్తాలతో తిరిగి వచ్చారు. చిట్టచివరకు నారదుడు వచ్చి అనిరుద్ధుని వృత్తాంతం చెప్పాడు. హరి ఆగ్రహావిష్టుడయ్యాడు. పూర్వజ, కుమార సమేతుడయి శోణిత పురానికి బయలుదేరాడు. బాణాసుర గర్వాన్ని అంతం చేయడంకోసం దీక్షబూని వెళ్తున్న కృష్ణాదుల్ని చూసి సిద్ధ సాధ్య చారణ గంధర్వ బృందాలు జయ జయా రావాలు చేశాయి. కృష్ణుని అయిదు పద్యాల్లో కీర్తించాయి. (5-17A, 17B 18, 19,20)

22. ఉత్తర హరివంశము 4-316

ఉదా॥మ. జయనారాయణ పుండరీకనయనా శార్ఙ్గీ జగన్నాయకా
జయ పీతాంబర భక్తవత్సల విరించస్తోత్ర పాత్రక్రియా
జయ జంభారి విరోధివిక్రమ కథాశ్లాఘా విఘాతక్రమా
జయ గోవింద ముకుంద మందరధరా శౌరీమురారీ హరీ[23]

యుద్ధానికి వెళ్లేప్పుడు జయజయధ్వానాలు వినరావడం శుభసూచకం. ఈసన్నివేశాన్ని కల్పించడం ద్వారా నాచనసోమన భావికథా సూచన చేసినట్టయింది. కృష్ణుడు బాణాసురుని గెలవడం తథ్యమని విస్పష్టమయింది.

### 3. 4. 12. శైవజ్వర భక్తి :

కృష్ణ శైవజ్వరాలకు ఘోరాహవం సిద్ధించింది. కృష్ణుడు శైవజ్వరాన్ని పట్టుకొని విసరివేశాడు. జ్వరుడు మృతుడయ్యేనని లిప్తపాటు ప్రమత్తుడయి ఉన్నాడు. శైవజ్వరం అదను కనిపెట్టింది. కేశవునిలో ప్రవేశించింది. చీకాకు పరచింది కృష్ణుడు దానికి ప్రతిగా వైష్ణవజ్వరాన్ని సృజించాడు. అది ప్రత్యర్థిని వెడల నడచింది. తలపడి ప్రుక్కడజేసింది. శైవజ్వరాన్ని వధించడానికి అనతిమ్మని వైష్ణవజ్వరం కృష్ణుని కోరింది. అశరీరవాణి వారించింది. కృష్ణుడంగీకరించి అభయ దృక్కులు ప్రసరింపజేశాడు. శైవజ్వరం బ్రతికి బయట పడింది. వాసుదేవుని పలువిధాలుగా వినతించింది. అతని ఘనతను కొనియాడింది. పలుఅవతారాలెత్తిన విష్ణువుగా విశ్వభర్తగా వినుతించింది. ఈ వినుతిని సోమన నాలుగు పద్యాల్లో (6-115 నుండి 118 వరకు) సంతరించాడు. వాటిలో రామావతారాన్ని క్లుప్తంగా సమగ్రంగా ప్రతిపాదించే పద్యం పేర్కొనదగింది.

సీ. తాటకా జీవన స్థైర్యంబు శరభాను
సంచయ ప్రభలకుఁ జవులు చూపి
ఖరదూషణానేక వర పత్త్రినివహంబు
నాశుగపఙ్క్తికిఁ జీకాకు పఱచి

23. ఉత్తర హరివంశము 6-20

రాజ_త్తర కబంధ రాక్షసు జంఘాల
పత్త్రి సంఘంబుల పాలుచేసి
పౌల_స్త్య వరశిరః పద్మ సందోహంబుఁ
దన శిలీముఖములఁదవులఁజేసి

ఆ. రాఘవత్వమందు రణసరోలీలలఁ
గ్రాలు చున్న నిన్నుఁగన్నులార
జూడగంటి జన్మ సుఖమెల్లఁబొడగంటి
ముదముతోడఁజేరి మ్రొక్కఁగంటి 24

కృష్ణుని దశావతారునిగా శ్రీమన్నారాయణునిగా కీర్తించే వేడుక సోమనకు కలిగి ఉంటుంది. దాన్ని శాంకరజ్వరముఖాన పూర్తి చేసుకొన్నట్లు తోస్తుంది.

దేవతలు, సిద్ధసాధ్య చారణ గంధర్వులు, ఋషులు, రాజులు, సామాన్య మానవులు పిశాచాలు చివరకు రోగాలు కూడా కృష్ణుని పట్ల భక్తిభావం ప్రదర్శించినట్లు సోమన చిత్రించి ఉండటం మనోజ్ఞంగా ఉంది. ఈ కోణాన్నే గాక వేరొకకోణంలో కూడా సోమనభక్తిని దర్శించి ప్రదర్శించాడు కృష్ణుడు ఇతరుల పట్ల కనబరచిన భక్తే ఇది

## 3. 5. కృష్ణుడు ఇతరుల పట్ల ప్రదర్శించిన భక్తి :

సర్వజనులూ తనపట్ల భక్తిభావం ప్రదర్శించి సత్ఫలితాల్ని పొందుతుండే కృష్ణుడూ ఇతరులపట్ల భక్తిని ప్రదర్శించి ఆదర్శప్రాయుడయ్యాడు. ఇది అత్యాశ్చర్య కరం కదా! దీన్ని గురించి కొంత ముచ్చటించుకోవడం ముదావహం.

### 3. 5. 1. బదరికాశ్రమ ఋషులందలి భక్తి :

బదరికాశ్రమ ఋషులు నరక పరిభూతులై ద్వారక చేరారు. నరకాసురోపద్రవాన్ని బాపుమని సత్యాపతికీ సవినయంగా మనవి చేసుకోదలచారు. సుధర్మ సౌధం చొచ్చారు. శైనేయుడు వారికి అర్ఘ్యపాద్యాదులిచ్చి సత్కరించారు. ఇంతలో

24. ఉత్తర హరివంశము 6-118

కృష్ణుడక్కడికి వచ్చి వారిని వివిధోపచారాలతో సంప్రీత చేతస్కులుగా చేశాడు. ఈ సందర్భంలో వారిపట్ల కృష్ణునికి గల భక్తి ప్రస్ఫుటమవుతుంది.

చ॥ అచటికి దానవాంతకుఁడు నంతటిలోఁజని యూనః ప్రార్థ్యితో
నుచిత విధోపచారముల నూఱటగాఁ గుశలాను యోగ వా
క్య చతురతన్ముదం బెసఁగ సంఘటి ధన్యులఁజేసి భక్తి నప్ర
చలితుఁడయ్యె వారలును సాయనముల్ మునుసూపి పిమ్మటన్[25]

సర్వలోకనేత సవినయంగా ఋషుల్ని సంభావించడం అతని ఆణకువను ఆదర్శచిత్త వృత్తిని వ్యక్తం చేస్తున్నాయి. పాత్రచిత్రణలో సోమన నైపుణ్యం ఇక్కడ వ్యక్తమవుతుంది.

3.5.2. శివునిపట్ల భక్తి :

సత్పుత్రుని బడయాలనే సంకల్పం రుక్మిణీదేవిని త్వరపెట్టింది. ఆమె తన కోరికను కృష్ణునికి విన్నవించింది. కృష్ణుడంగీకరించాడు. పరమశివుని గురించి తపస్సు చేసి అతని వరప్రసాదంతో పుత్రుని బడయనెంచాడు. కైలాసనగరం చేరుకొన్నాడు. శివుని గురించి ద్వాదశవర్షాలు తపస్సు చేశాడు. శంకరుడతని ఎదుట నిలిచాడు. అతని మాహాత్మ్యాన్ని కొనియాడుతూ కృష్ణుడు పలువిధాల కీర్తించాడు. ఇక్కడ శివునిపట్ల కృష్ణునికి గల భక్తి భావం వెల్లడవుతుంది.

సీ. కల్హార మకరంద కలిత మందాకినీ
లహరీ పరీత కోలాహలంబు
బాలేందు చంద్రికా పరభాగ శోభాప
రాగ సంభావి తారగ్వధంబు
సేవా సమా సన్నసిద్ధ సీమంతినీ
తాలవృంతోత్తాల తాండవంబు
కాత్యాయనీ దత్త కర్ణావతంసక
ర్పూర ఖండామోద పూరితంబు

25, ఉత్తర హరివంశము 1-109

తే. మారుతంబు నా మీఁదట మలసియాడ
గలుగు నొకొ నాకు నొక నాడు కన్నులార
శివునిఁ జూచు పుణ్యంబను చిఁత నెఱయ
మొదలి వేలుపుఁబొడఁగంటి మ్రొక్కఁగంటి. 26

3. 5. 3 మాతాపితలందలి భక్తి :

హంసడిభకులు మడిశారు. రామకృష్ణులు గోవర్ధనాద్రి చేరారు. స్నేహితులతో సరస సల్లాపాలతో పొద్దుపుచ్చసాగారు ఈ సంగతి గోకులానికి తెలిసింది. పుత్రుని చూసే కుతూహలంతో యశోదానంద గోపులక్కడికి వచ్చారు. రామకృష్ణులు వారికి నమస్కరించారు. వారిపట్ల తమకుగల భక్తిని ప్రకటించుకొన్నారు. పితరుల్ని వాత్సల్యంతో చూశారు.

క॥ ఇతరేతర సందర్శన
కృతాభివాదనుల రామకృష్ణులఁ బ్రీతిన్
సతియును బతియుం జూచిరి
సుతులుం బితృభక్తి నెఱయఁ జూచిరి వారిన్ 27

ప్రయోజకులు, ఉన్నతస్థితి కెదిగిన కుమారులు యథాపూర్వంగా పితృభక్తి కనబరచడం అరుదు. కానీ రామకృష్ణులు పితృభక్తిని ప్రకటించి పితరుల పట్ల తమకుగల నమ్రతను వెల్లడి చేశారు. ఆదర్శ ప్రాయులయ్యారు.

కృష్ణునిమీద యశోదకు గల వాత్సల్యం చాలా ఎక్కువ. ఆమె అతన్ని బాల్యం నుండీ అల్లారు ముద్దుగా పెంచి పెద్దచేసింది. అట్టి మాతృ ఋణాన్ని తీర్చుకోవడం దుష్కరం. కృష్ణుడు ఆమె పట్ల అపార భక్తిని ప్రదర్శించడమేగాక ఆమెను సంస్మరించినవారు తన కత్యంత ప్రీతి పాత్రులవుతారనీ, వారికి పెక్కు శుభాలు సంప్రాప్తమవుతాయనీ ఆయాచింతగా వరాలిచ్చి యశోదకు ఆనందం, ఘనత చేకూర్చాడు.

---

26. ఉత్తర హరివంశము 2-173
27. ఉత్తర హరివంశము 4-306

నాచనసోమన భక్తితత్త్వం

శా. తల్లీ నిన్నుఁగనుంగొనం బసుటయున్ ధన్యుండనైతిన్ జగం
బెల్లన్నిన్ను నుతించి మ్రొక్కిన ధనాధీశోన్నతిన్ నిత్యమై
చెల్లున్నాకుఁ బ్రియంబు చేయునదిగామై చెన్నొందునా వారుని
న్నుల్లంబారఁదలంచువారు పరమాయుః ప్రాపితారోగ్యులున్[28]

కృష్ణుడు సాక్షాత్ విష్ణువు. సర్వలోకాధిపుడు. సర్వలోక శరణ్యుడు. అట్టివాడు సామాన్య మానవునివలె తల్లిదండ్రుల పట్ల భక్తిని ప్రదర్శించడం ఆశ్చర్యకరం. కానీ తక్కిన సామాన్యులకు అనుసరణీయమయిన మార్గంచూపి కృష్ణుడు ఆదర్శప్రాయుడయ్యాడు.

భక్తితో ఆరాధింపదగిన కృష్ణుడు కూడా ఇతరులపట్ల భక్తిభావం ప్రదర్శించాడు. దాని ద్వారా భక్తి పరమోత్కృష్టత చాటి చెప్పినట్టయింది తక్కినవారూ ఆ మార్గాన్ని అవలంబించాలని సందేశమిచ్చినట్టయింది.

ఇంతవరకు కృష్ణుని పట్ల ఇతరులు, ఇతరుల పట్ల కృష్ణుడు ప్రదర్శించిన భక్తి సంభరిత సన్నివేశాల్ని పరిశీలించాము. ఉత్తర హరివంశంలో కృష్ణుని తరువాత ప్రముఖ స్థానం పొందిన ఈశ్వరుని పట్ల ఇతరులు కనబరచిన భక్తిని, ఇతరుల పట్ల ఈశ్వరుడు చూపిన భక్తిని ప్రస్తుతం పరిశీలించడం సమంజసం.

## 3.6. శివుని పట్ల ఇతరులు ప్రదర్శించిన భక్తి :

ఉత్తర హరివంశంలో శివుని పాత్ర చాలా పరిమితమయింది. కాబట్టి కొందరు మాత్రమే అతని పట్ల తమకు గల భక్తి భావాన్ని ప్రదర్శించడానికి వీలయింది. కృష్ణుడు, హంసడిభకులు, బాణాసురుడు మొదలయిన కావ్య గత పాత్రలు శివునిపట్ల తమకు గల భక్తిని వెల్లడించుకొనినట్టు సోమన చిత్రించాడు.

### 3.6.1. కృష్ణుని భక్తి :

పుత్రార్థిఅయి కైలాసానికివెళ్లి కృష్ణుడు ఈశ్వరుని గురించి తపస్సు చేశాడు. ద్వాపశవర్షానంతరం శివుడు ప్రత్యక్షమయ్యాడు. కేశవుడు భక్తిరస పరిప్లావితాంత

28. ఉత్తరహరివంశం 4 - 212

రంగు వయ్యాడు. అంబికాపతిని నోరారా కీర్తించాడు. మనసారా భావించాడు. తన్మయుడయిన అతనిస్థితి శివభక్తికి పరాకాష్ఠ.

సీ. తరుణ పల్లవరాగ తామ్ర విద్యుల్లతా
భాసురంబగు జటాభార మెఱింగి
నిబిడసంతమస సాతిసీల బాలతమాల
పరిపంథియగు కంఠభాగ మెఱింగి
తారముక్తాహార ధవళ శారదనీర
దాకార మగు నిర్మలాంగ మెఱింగి
ద్రవ శాత కుంభ గౌర కుసుంభ కుసుముఖం
డనశీల మగు ఫాలనయన మెఱింగి

తే. యెఱింగి కొనవచ్చు నట మీఁద హృదయ కమల
కర్ణికా భద్ర పీఠంబుఁగదియఁజేర్చి
వర సుధాభిషేకంబునఁ బరమయోగి
సార్వభౌముండవగు నిన్నుఁజంద్రమౌళి.[29]

కృష్ణుడు ఈశ్వరాకారాన్ని ఒకసారి స్మరించాడు. భావించి భావించి పరవశు డయ్యాడు. కీర్తనా రూపంలో వెల్లడించాడు. పరమయోగి సార్వభౌముడని శివుని గుర్తించటం అతని దక్షిణామూర్తి స్థితిని స్మరించినట్టయింది. భగవత్స్మరణ, భావన, కీర్తన పారమార్థిక రంగంలో అత్యంత ఉపయుక్తాలని అభివ్యక్త పరచినట్లయింది

3.6.2. హంసడిభకుల భక్తి :

బ్రహ్మదత్తుని కుమారులు హంసడిభకులు. ఈశ్వరుని గురించి తపస్సు చేసి ఇష్టార్థ సిద్ధి పొందగోరారు. హిమవన్నగాగ్రానికి వెళ్ళారు. తపశ్చరణ కుపక్రమించారు. వారి మనసు శంకరుని పాదాలమీద లగ్నమయింది తదేకంగా పినాకి పాదాల్ని స్మరించారని అభిప్రాయం. ఈ విధంగా వారు స్మరించటం వారి స్మరణభక్తిని విస్పష్టం చేస్తూ ఉంది.

---

29. ఉత్తర హరివంశము 2-174

క. వారిరువురు నై దేడులు
నీరును గాలియును ద్రావి నిర్మలతరచే
తో రాజీవ భ్రమరము
గౌరీపతిఁదలఁచి నిష్ఠగైకొని యుండన్.30

హంసడిభకులు రాకుమారులు. బాలురు. సుకుమారులు. వీరు హిమాలయం మీద నీరు, గాలి మాత్రమే తాగి అయిదు సంవత్సరాలు కఠోర తపస్సు చేశారు ఇది వారి కష్టసహిష్ణతకు కార్య సాధనాదీక్షకు ప్రబల నిదర్శనం.

3 6.3. బాణాసురుని భక్తి :

బలి కుమారుడయిన బాణాసురుడు శూలి కుమారస్వామిని గౌరవించేవైనం చూశాడు అలాంటి స్థితినే తాను కూడా పొందాలనుకున్నాడు. అందుకోసం శివుని మెప్పించడానికి సమకట్టాడు. తపస్సు చేయబూనుకొన్నాడు. ఏకాగ్రచిత్తుడై శివుని స్మరించటం మొదలెట్టాడు. ఇక్కడ స్మరణభక్తి జాలువారింది.

..............................................
.........నిశ్చలగతిన్ ముగ్ధేందు చూడామణిన్
ముని సంఘాత శిరోఽభినీత చరణాంభోజాత సంభూతసు
తన రాగద్యుతి భాసురుం బురహరుం దత్త్వస్థితిం జూచుచున్ 31

బాణాసురుడు ఏకాగ్ర చిత్తుడై శివుని ధ్యానించాడని చెప్పే సందర్భంలో సోమన ఈశ్వరుని కీర్తించి అతని పట్ల తనకు గల భక్తిని వెల్లడి చేసుకొన్నాడు మహేశ్వరుని సంబోధిస్తూ అతని మహాత్మ్యాన్ని మూడు పద్యాల్లో (5-9నుండి 11 వరకు) కీర్తించాడు. శివుని మహత్త్వాన్ని, తన అల్పత్వాన్ని వెల్లడిచేసుకొన్నాడు. తన సాధనలో కూడా శివునే తోడ్పడుమని కోరాడు.

ఉ. కొలఁదిగాఁగ నేర నిన్ను శతకోటి విభాకర తేజు దగ్గఱం
బిలువఁగ నేర నిన్ను మునిబృంద వివేక విమర్శ దూరునిన్

30. ఉత్తర హరివంశము 4-14 31. ఉత్తర హరివంశము 5-7

నిలువఁగ నేర నిన్నుఁ బృథివీవియ దంతరభిన్ను నేమిటన్
నిలువఁ గదయ్య నా హృదయ నీరజకర్ణికపై
మహేశ్వరా. 32

బాణుడు ఈశ్వరుని సర్వమయునిగా పేర్కొంటూ తేజోమయుడని కొనియాడాడు. ఇతోధిక తేజోవంతుడయ్యాడు.

శివుడు కూడా కృష్ణుని వలె ఇతరుల భక్తిని పొందడమే గాక ఇతరుల పట్ల తనకు గల భక్తిని వెల్లడించాడు. కృష్ణుని యెడ తన భక్తిని సముచితంగా సమయోచితంగా బహిర్గతం చేశాడు.

## 3.7. ఇతరుల పట్ల శివుడు ప్రదర్శించిన భక్తి :

ఉత్తర హరివంశంలో శివుని పాత్ర ఉన్నతంగా చిత్రింపబడింది. దేవతలే గాక దేవ దేవుడు కూడా కీర్తించదగిన ఉన్నతస్థితి ఆయనది. అందువల్లే ఉత్తర హరి వంశంలోని పాత్రలు వేటిని గానీ శివుడు ప్రశంసించనైనాలేదు. అయితే కృష్ణుడు విష్ణుస్వరూపుడు. శివకేశవులిద్దరూ సర్వత్ర సర్వ విధాలా సమానులు. ఈ కారణంగా సోమన శివుని చేత కృష్ణుని కీర్తింప జేశాడు. కృష్ణభక్తి ప్రదర్శింపజేశాడు.

### 3.7.1. శివుని కృష్ణభక్తి :

సత్పుత్రుని పొందగోరిన శౌరి సాంబుని గురించి తపస్సు చేశాడు. అభవుడు ప్రత్యక్షమయ్యాడు కేశవుడు శివస్తుతి చేశాడు. శివుడు పరవశించాడు, పుత్రుని ప్రసాదించాడు. తరువాత మాయామానుష విగ్రహుడయిన కృష్ణుని విష్ణువుగా గుర్తించాడు. అవతార పురుషునిగా తెలిసికొన్నాడు. ఆనందంతో అతని మనసు గంతులు వేసింది. కృష్ణుని గరిమను కొనియాడుతూ రెండు పద్యాలు (2-218,219) చెప్పాడు.

గీ॥ ఆద్యబీజాయ విశ్వకర్త్రేఽక్షరాయ
నిర్గుణాయ గుణాత్మనే నిర్మలాయ

32. ఉత్తర హరివంశము 5-9

హరిహరాత్మనే ప్రవర దివ్యాయ యజ్ఞ
సూకరాయ నమోయనుచు న్నుతింతు.[34]

ఈ పద్యం వల్ల శివునికి కృష్ణుని పట్ల గల భక్తి వెల్లడి కావడమే గాక అది కీర్తన మనే కోవకు చెందిందని కూడా విదితమవుతుంది.

భక్తిని పలువురు పలురకాలుగా వర్గీకరించినా నాచనసోమన ప్రదర్శించిన భక్తితత్త్వం భాగవత వర్గీకరణకు కొంత దగ్గరగా ఉన్నట్టు ఈ పరిశీలనవల్ల తెలుస్తూ ఉంది. అయినా భాగవత నిర్దేశకాలయిన నవవిధ భక్తుల్ని ఈయన సమగ్రంగా కొనియాడలేదు. కథాపరిధికి లోబడే సోమన పై భక్తిరకాల్ని ఆవిష్కరించవలసి వచ్చింది. అందుకే షడ్విధ భక్తుల్ని మాత్రమే స్వీకరించాడు: అవి కీర్తనం, స్మరణం పాదసేవనం వందనం, సఖ్యం, ఆత్మ నివేదనం.

ఈ భక్తి విధాల్ని పేర్కొనడమే గాక సోమన శివకేశవుల పట్ల ఇతరుల ప్రదర్శించిన భక్తిని, శివకేశవులు పరస్పరం ప్రదర్శించుకొన్న భక్తినీ సమగ్రంగా చిత్రించాడు. ఇందువల్ల హరిహరులు సమానులనీ, ఉభయులూ రూపమాత్ర భిన్నులేనని ధ్వనింప జేశాడు, హరిహరాద్వైత స్థాపనలో తిక్కన ననుసరించే తన లక్ష్యంలో కృతకృత్యుడయ్యాడు.

---

34. ఉత్తర హరివంశము 2-219

## 4. నాచనసోమన ప్రత్యేకతలు

4. 0. ఆంధ్ర సాహిత్యం ప్రబంధోన్ముఖంగా ప్రగమిస్తున్న రోజులవి. ఎఱ్ఱన శ్రీనాథుల మధ్యకాలంలోనే నాచనసోమన జన్మించాడు. తనకు ముందున్న సాహిత్యమంతా ఒకేవిధంగా ఉండటం గుర్తించాడు. కొత్త ఆశయాలతో కొత్త భావాలతో కొత్త పోకడల్ని ప్రదర్శించే ప్రయత్నం చేశాడు. నవీనగుణ సనాథుడనే విఖ్యాతి నార్జించాడు ఈ విఖ్యాతికి కారణమయిన పలుప్రత్యేకతలీయనలో చోటు చేసుకొన్నాయి. అతని రచన ద్వారా వాటిని పరిశీలించి ఈ వ్యాసరచనకు సమగ్రత కూర్చవలసి ఉంది. ఈ ప్రత్యేకతల్ని శబ్దసంబంధాలు, అర్థ సంబంధాలు అని రెండు రకాలుగా వర్గీకరించుకోవచ్చు. ఈ వ్యాసరచనలో శబ్దచర్చకు ప్రాధాన్యతలేదు. శబ్ద సంబంధాన్ని గురించి ఆలోచించడం అనావశ్యకం, అప్రస్తుతం అవుతుంది కాబట్టి అర్థ సంబంధాన్ని గురించి మాత్రమే ఆలోచించడం సముచితం. స్థూలంగా పరిశీలిస్తే వీటిలోనూ ఉపవర్గాలు లేకపోలేదు. అవి శ్రీకృష్ణనారాయణ నిరూపణ, హరి హరాభేదం, శైవ వైష్ణవ సంప్రదాయాల్ని వెల్లడి చేయడం, శైవస్తుతి, చక్రస్తుతి

### 4. 1. శ్రీకృష్ణనారాయణ నిరూపణ :

"శ్రీమన్నారాయణోవిష్ణుర్వాసు దేవోఽభిరక్షతు" అని విష్ణు సహస్రనామ స్తోత్రంలో ఉంది. ఇందువల్ల విష్ణుసహస్ర నామాల్లో నారాయణ నామం కూడా ఒకటని విస్పష్టమవుతూ ఉంది. విష్ణువుధరించిన దశావతారాల్లో కృష్ణావతారం కూడా ఒకటి. చాలాప్రధానమయింది ఇది మన హైందవుల విశ్వాసం ఈ విశ్వాసాన్ని ఆదరించడమేగాక సోమన దీన్ని బాగా జీర్ణింప జేసుకొన్నాడు. తన కావ్యంలో పలు చోట్ల శ్రీకృష్ణుని నారాయణునిగా నిరూపించాడు. ఈ నిరూపణను కూడా రెండు రకాలుగా విభజించుకోవచ్చు. కృష్ణుని నారాయణ శబ్దంతో పేర్కొనడం, శ్రీకృష్ణుడే విష్ణువని ఇతరాంశాలతో నిరూపింప ప్రయత్నించడం.

#### 4.1.1. శ్రీకృష్ణుని నారాయణ శబ్దంతో కీర్తించడం :

సోమన కృష్ణుని నారాయణ శబ్దంతో కావ్యగత పాత్రలద్వారా కీర్తింప జేశాడు తానూ స్వయంగా కొనియాడాడు.

4 1. 1. 1. ఉత్తర హరివంశ పాత్రలు కృష్ణుని నారాయణునిగా కీర్తించడం :

సోమన తాను స్వయంగా కృష్ణుని నారాయణునిగా కొనియాడటమే గాక ఉత్తర హరివంశ పాత్రలచేత కూడా కొనియాడ జేశాడు. ఇందుకు సంబంధించిన ఉదాహరణలు కావ్యమంతా కనిపిస్తాయి.

నరకుడు బదరికాశ్రమ ఋషుల్ని బాధపెట్టాడు. పరిభూతులై పీడితులయినవారు కృష్ణసందర్శనం చేసుకొన్నారు. తమకడగండ్లు నివేదించుకొన్నారు ఆసందర్భంలో కృష్ణుని నారాయణునిగా పేర్కొన్నారు.

క॥ నారాయణ! నీ మన్నన
కారణముగ మేము బదరికావన భూమిం
జేరితిమి నరకుఁడిమ్మెయిఁ
గారించెం దనకుఁ జేటు కాలంబునకున్ [1]

అర్జునుడు ధర్మరాజాదులకు కృష్ణమహిమను తెలియజేయడంకోసం బ్రాహ్మణ మృత పుత్ర రక్షణ వృత్తాంతం తెలిపాడు. విప్రాంగన ప్రసూతి సమయంలో శిశు రక్షణ కోసం వెళ్లిన అర్జునుడు వ్యర్థకాముడై ద్వారవతికి తిరిగి వచ్చాడు. కృష్ణుని సందర్శించాడు. ఈ విషయాన్ని ధర్మరాజాదులకు చెబుతూ కృష్ణుని నారాయణునిగా పేర్కొన్నాడు.

క. ఈరూపునఁబోలి వోయిన
బీరముతో వృష్ణి భోజ విభు లేతేరన్
ద్వారవతి కరిగి నిలిచితి
నారాయణు నెదుర ఖేదనమ్ర ముఖుఁడనై [2]

అనిరుద్ధుని బాణాసురుడు నిరోధించాడు. కారాగారంలో బంధించాడు. శౌరికి నారదునివల్ల సమాచార మందింది. బలభద్ర ప్రద్యుమ్న సమేతుడై గరుడునదిరో

---

1. ఉత్తరహరివంశము 1-114
2. ఉత్తర హరివంశము 2-35

హించి బాణుని మీదికి దాడి వెడలాడు. ఆకాశంలో వెళ్తున్న హరిని సిద్ధసాధ్య చారణ గంధర్వులు తిలకించారు. వినుతించారు. ఈ సందర్భంలోనూ కృష్ణుని వారు కొనియాడారు.

మ. జయ నారాయణ పుండరీకనయనా శార్ఙ్గి జగన్నాయకా
జయ పీతాంబర భక్తవత్సల విరించ స్తోత్ర పాత్రక్రియా
జయ జంభారి విరోధి విక్రమ కథా శ్లాఘావిఘాత క్రమా
జయ గోవింద ముకుంద మందరధరా శౌరీ మురారీ హరీ ³

### 4.1.1.2 సోమన స్వయంగా కృష్ణుని నారాయణునిగా కొనియాడడం:

సోమన కూడా కృష్ణుడే సాక్షాత్ నారాయణుడని చాలా చోట్ల కొనియాడి ఉన్నాడు. పౌండ్రకుని దురాలాపాలు విన్న నారదుడు దురంత సంతాపంతో బదరికాశ్రమం చేరాడు. కృష్ణుని దర్శించాడు పౌండ్రకుని ప్రల్లదాల్ని వినిపించాడు కృష్ణుడు పౌండ్రకుని హతమారుస్తానని అభయమిచ్చాడు. ఆ సమయంలో కృష్ణ శబ్దానికి బదులుగా నారాయణ శబ్దాన్ని ప్రయోగించి కృష్ణుడే నారాయణుడనే విషయంలో తన ఏకీభావాన్ని సోమన వెల్లడించాడు.

క॥ అనుటయు నారాయణుడను
మునినాయకు వేగపడకు మూఢుని బౌండ్రా
వని విభుని నీవు సూడఁగఁ
దునుముదు నేఁ డెల్లిలోన దుత్తునియలుగాన్.4

వాసుదేవ పౌండ్రక వాసుదేవు లిద్దరికీ ఘోరాహోమయింది. కృష్ణుడు తన చక్రంతో పౌండ్రకుని శిరస్సును ఖండించాడు. ఈ సందర్భంలో కూడా సోమన కృష్ణుని నారాయణునిగానే పేర్కొన్నాడు.

---

౩. ఉత్తర హరివంశము 6-20

౪. ఉత్తర హరివంశము 8-22

మ. అని నారాయణుఁడమ్ములం దునిమె నానాస్త్రంబులం గ్రమ్మఱం
గవియంజేసి యొక్కింత బీరము సెడంగారించి దైతేయ చ
క్రవిదారక్రక చక్రమంబయిన చక్రం బెత్తి తద్దేహముం
బవులన్వ్రేచినఁ దుంగ వ్రచ్చినగతిం బాసెం బ్రకాశంబుగన్.5

శ్రీకృష్ణుడు రుక్మిణీ సత్యభామలతో నెత్తమాడుతూ ఉన్నాడు. కృత్యదరికొన్న ప్రళయానలం లాగా ద్వారక దరిసింది. గోపవృద్ధులీ సంగతిని గోవిందునికి తెలియ జేయమని యదువృద్ధుల్ని అంతఃపురానికి పంపారు. కృష్ణుడు క్రీడా తన్మయుడై వారి రాకను గుర్తించినట్టు లేదు ఆ సందర్భంలో యదుకులాంబుధి సుధాకరుని నారాయణ దేవునిగా సోమన కొనియాడాడు.

వ. వార లన్నారాయణదేవుండు నెత్తంబు తమకంబునం దత్తఱంపు నొడువులంగల యందమకు నుత్తరంబిచ్చిన పలుకులం బురుషోత్తముని చిత్తంబు దమమీఁద లేదని విచారించి విన్నపం బవధారు దేవాయనుటయు నయ్యదుకులాంబుధి సుధాకరుండు సకల కళా కుశలుండు గావున నత్తఱి సత్యభామ పాసికలు దాలించి వైచిన6.

అనిరుద్ధబాణాసురులకు యుద్ధం జరిగింది. అసురపతి అనిరుద్ధుని మీద నాగాస్త్రాన్ని ప్రయోగించాడు. ఇక్కడ కృష్ణుని పౌత్రుడయిన అనిరుద్ధుని నారాయణ పౌత్రునిగా పేర్కొని ఉండటం గమనించదగింది.

క. ధీరుఁడు బాణుఁడదృశ్యా
కారుండయి పోయి కలను గయికొని ఖ(?)
స్ఫార ప్రచార పరుఁడగు
నారాయణపౌత్రు నేసె నాగాస్త్రములన్7

కృష్ణ బాణాసురల యుద్ధంలో బాణాసుర డాగ్నేయాస్త్రాన్ని ప్రయోగించాడు కృష్ణుడు దానికి ప్రతిగా పర్జన్యాస్త్రాన్ని విడిచాడు. దేవతలు కృష్ణుని సమయస్ఫూర్తికి

4. ఉత్తర హరివంశము. 3-22 5. ఉత్తర హరివంశము 3-104
6. ఉత్తరహరివంశము 3-140 7. ఉత్తర హరివంశము 5-261

సంగర నైపుణికి అతన్ని కొనియాడారు. ఈ అంశాన్ని తెలుపుతూ కవి కృష్ణ శబ్దానికి బదులుగా నారాయణ శబ్దం ప్రయోగించాడు. కృష్ణుడే నారాయణుడని ధ్వనింపజేశాడు.

క. కొనియాడిరి నారాయణు
వినుతించిరి ముదముతోడ వేడ్కలు దొలఁకన్
మనమున నవ్వటి కవ్వటి
కనూన వాక్యములఁబొగడి రంభోజాక్షున్. 8

ఇంకా చాలా తావుల్లో ఇలాంటి కవికృత నారాయణ శబ్ద ప్రయోగాలు ఉత్తర హరివంశంలో కనపిస్తున్నాయి.

**4.1.2. శ్రీకృష్ణుడే విష్ణువని ఇతరాంశాలతో నిరూపించడం :**

నారాయణ శబ్దాన్ని ప్రత్యక్షంగా ప్రయోగించి కృష్ణుని నారాయణునిగా నిరూపించడమే గాక విష్ణువుకు సంబంధించిన ఇతరాంశాల్ని కూడా వెల్లడిచేస్తూ శ్రీకృష్ణుని శ్రీమన్నారాయణునిగా నాచన సోమన నిరూపించాడు.

నరకాసుర పీడితులయిన బదరికాశ్రమ ఋషులు కృష్ణుని సందర్శించి వినుతించే సందర్భంలో కృష్ణుని విష్ణువుగా కొనియాడారు. విష్ణు మాహాత్మ్యాన్ని కీర్తించారు.

సీ. పన్నగంబులరాజుఁ బగవాఁడుఁగూడి నీ
శయనంబుఁ బయనంబు సంతరింప
దుగ్ధవారాశి కూతురు నాలుఁగూడి నీ
శరణంబుఁ జరణంబు సవదరింపఁ
దామర పగవాఁడు దయితుండుఁగూడి నీ
బడి చూపుఁ గుడిచూపుఁ బరిఢవింపఁ
జందురు చెలికాఁడు నయిదోడు గూడి నీ
యుల్లంబు మొల్లంబు నుపచరింపఁ

8. ఉత్తర హరివంశము. 6-203

తే. గంపమాన మనోధ్యాన గతులు మాన
కేకతంబున్న మునులకు నేకతంబు
లేక పొడగాన వచ్చు నీ లీల గాన
నన్యులేనాఁట ధన్యులే యంబుజా[illegible]. [9]

కృష్ణుడు పుత్రార్థి అయి శివుని గురించి తపస్సు చేయడానికి కైలాసాభిముఖుడై వెళ్ళాడు. మార్గ మధ్యంలో బదరికాశ్రమ భూమి చేరుకొన్నాడు. అక్కడి ఋషులతని కెదురు వచ్చి సముచిత సత్కారాలు చేశారు సన్నుతించి సంతుష్టులయ్యారు. ఆ సందర్భంలో విష్ణు మాహాత్మ్యం తేట పడేట్టు ఓనుతించి కృష్ణుడే శ్రీమహావిష్ణువని ధ్వనింప జేశారు.

సీ. ఆకాశగంగ నీయడుగునీఁ బొడమె నీ
కిట్లు ఘర్ఘ్య పాద్యంబు లిచ్చుటెంత
నిఖిలంబు రక్షింప నీరజోగుణమూర్తి
పని నీకుఁగుశల సంప్రశ్న మెంత
కమలంబు నీనాభి కన్నది నీకిట్లు
పుష్పాంతరంబుల పూజ యెంత
యమృతంబు నీచేత నమరులు గుడిచిరి
నీకు వన్యాహార నియతి యెంత

తే. యెంచ మా భక్తి యెంత ! మా యెఱుక యెంత !
మా తపోబలమెంత ! మా మనికి యెంత !
యింత సంతోష మొసఁగ నీ విచట నునికిఁ
గంటి మిది మాకు భాగ్యంబు కలిమి గాదె. [10]

---

9. ఉత్తర హరివంశము. 1-119
10. ఉత్తర హరివంశము 2-115

అరణ్యంలో హంసడిభకలు చేసిన ఆగడాల్ని అసురారికి తెలియ జేయడం కోసం దుర్వాసుడు ద్వారవతికి వచ్చాడు. కృష్ణుని దర్శించాడు. యదు నాథుడు ముని నాథుని సత్కరించాడు వచ్చిన కార్యమడిగాడు దుర్వాసుడు కృష్ణుని కారణ జన్మాన్ని, త్రికాలజ్ఞతనూ తెలియజేసి తమ సంగతి తెలియకుంటుందా ? అని ప్రశ్నించాడు. ఇక్కడ కృష్ణుడు విష్ణువే అని ధ్వనిత మవుతుంది.

మ. తగునే యింత మురాంతకా తలఁపవే త్రైలోక్యముంగావ నీ
వుగదా దానవవైరివై పొడమి లావుంజేవయుం జూపరూ
పగు దైవంబు గదాధరుండ వఖిల వ్యాపార పారంగమా
ధ్వగ మావృత్త మెఱుంగ నేర వనఁ జిత్తం బుత్తలం బందదే. [11]

సోమన కృష్ణుని పట్ల తనకు గల భక్తి పెంపువల్ల నారాయణ శబ్దాన్ని ప్రత్య క్షంగా ప్రయోగించాడు. కొన్నిచోట్ల తానే స్వయంగా చెపూ మఱికొన్ని సందర్భాల్లో పాత్రల ముఖంగా చెప్పిస్తూ శ్రీకృష్ణుడే శ్రీమన్నారాయణుడని నిరూపించాడు.

## 4.2. హరిహరాభేదం :

హరి అంటే విష్ణువు. హరుడంటే శివుడు. హరిహరుల కలయిక హరిహరనాథ తత్త్వం వేదాల్లోనే స్పష్టాస్పష్టంగా మనకు గోచరిస్తూ ఉంది. మంత్ర పుష్పంలో చెప్ప బడిన "త్వంరుద్రః, త్వంవిష్ణు త్వమ్ త్వంబ్రహ్మాత్వం ప్రజాపతిః అనే వాక్యాల్ని, 'సశివః సహరిః' అనే వాక్యాల్ని చూస్తే వేదాలు కూడా శివకేశవాభేదాన్ని చెప్పినట్లు నిర్ధారింపవలసి ఉంది.

స్థూల దృష్టితో చూస్తే పురాణాల్లో కొన్ని శివాధిక్యాలు మరి కొన్ని విష్ణ్వాధి క్యాలు. శైవ పురాణంగా భావింపబడే స్కాందంలో విష్ణు మాహాత్మ్యం ప్రకటింప బడింది. బ్రహ్మాండ పురాణంలో విష్ణువు తన భక్తుడు శివద్వేషి అయితే తనను కూడా ద్వేషించినట్లే అని చెప్పినట్లు వాక్యాలున్నాయి. అగ్ని, విష్ణు, కూర్మ పురాణాలు కూడా హరి హరాభేదాన్ని ప్రతిపాదిస్తున్నాయి.

---

11. ఉత్తరహరివంశం 4-91

ఇతిహాసమయిన మహాభారతంలో కూడా హరిహరాభేదం కానవస్తుంది. దీనిలో కృష్ణ మాహాత్మ్యానికి ప్రాధాన్యమియ్యబడింది. అక్కడక్కడ హరుని మాహాత్మ్యాల్ని విస్తరించే ఘట్టాలున్నాయి. ఉదాహరణకు ద్రోణ, అనుశాసనిక పర్వాలు. సైంధవ సంహార సంసిద్ధుడయిన అర్జునుడు కృష్ణునర్చించాడు. ఆ నాటి రాత్రి కృష్ణార్జునులు కైలాసానికి వెళ్ళారు కృష్ణార్పితాలయిన పూజాద్రవ్యాలు పరమ శివుని దేహం మీద ఉండటం గురించి అర్జునుడు చకితుడయి అభేదభావం పొందాడు.

క్రీ॥ శ॥ 809లో వెలసిన గంచనామి శాసనంలో హరిహరస్తుతి ఉంది క్రీ॥శ॥ 578లోని పశ్చిమ చాళుక్య రాజు పృథ్వీ వల్లభ బిరుదాంకితుడు హరిహరుని నుతించినట్టు బాదామి గుహల్లోని విగ్రహాలు సాక్ష్యమిస్తున్నాయి పల్లవ నరసింహ నిర్మితమయిన భైరవుని కోనలో హరిహర విగ్రహాలున్నాయి. క్రీ॥ శ॥ 1173-1220కి చెందిన హొలాశ్వదండ నాథుడనే రాజు హరి హరాలయ నిర్మాణం గావించాడని చెప్పబడుతూ ఉంది వేంకటేశ్వరుడు కూడా హరిహరుడని చెప్పవచ్చు. ఆళ్వారుల పాశురాలు ఇందుకు సాక్ష్యాలు.

హరి హరు లిద్దరూ హరించే వారే అవుతారు. 'హరతి నేత్ర దుఃఖమితి హరిః' "హరతి పాపానీతిహరః' (శబ్ద కల్ప ద్రుమము- పంచమ కాండము- పుట 507) అనే వాక్యాలు గమనించదగ్గవి. పరిశీలిస్తే ఈ రెండూ ఒకే ధాతువు నుండి నిష్పన్నమయినట్లు గోచరిస్తుంది. హృఞ్ - హరణే ధాతువు మీద 'ఇ' ప్రత్యయం చేరిస్తే హరి. 'అ' ప్రత్యయం చేరిస్తే హర అయింది. కాబట్టి హరి హర శబ్దాలకు మూల ప్రకృతి ఒకటే అవీ, ప్రత్యయ భేదం వల్ల శబ్ద స్వరూప భేదం మేర్పడినట్టు చెప్పవచ్చు. యథార్థ తత్త్వంలో కూడా వీరిద్దరూ ఒకరే. ఒకే బీజాన్నుండి ప్రభవించిన రెండు వృక్షాలు. ఆకారంలో వేరయినప్పటికీ ఒకే మూలానికి చెందినట్టుగా ఒకే తేజం నుండి ప్రభవించిన హరి హరులు ఏకత్వాన్ని పొంది ఉన్నారని హరిభట్టు అనే కవి వినుతించాడు.

ఆంధ్రకవులు పలువురు హరి హరనాథ తత్త్వాన్ని ఆరాధించి ఉండటం గమనార్హం. క్రీ॥ శ॥ 13వ శతాబ్దం నాటికి వీరశైవ మత విజృంభణం వల్ల నామ మాత్రావశిష్టమై ఉన్న అద్వైతమత పునః ప్రతిష్ఠాపనానికి ఆంధ్రదేశంలో కృషి చేసిన వారు మహాకవి తిక్కన హరిహరనాథుని తొలుత సేవించిన కవివరేణ్యుడీయనే. భారత

కృత్యారంభంలో ధర్మాద్వైతంతో హరి హరాద్వైత ప్రతిపాదకమయిన పరతత్త్వాన్ని కొలిచాడు. ఈ మూర్తి కల్పితమని కొందరు, అర్చారూపమని కొందరు భావించారు 'ఈ దృశంబులగు పుణ్య ప్రబంధములు దేవ సన్నిధిం బ్రశంసించుటయుఁ అనే వాక్యాన్ననుసరించి నెల్లూరులో హరిహరాలయంలో కూర్చుండి తిక్కన భారత రచన గావించాడని విమర్శకులంటారు. కానీ ఆశ్వాసాద్యంత పద్యాల్ని చూస్తే తిక్కన హరిహరుడు అర్చారూపుడు గాక భావనా విలసితుడని చెప్పవలసి ఉంది. తిక్కన విరాట పర్వారంభంలోనే

ఉ. శ్రీయనగౌరినాఁ బరగు చెల్వకు చిత్తము పల్లవింపభ
ద్రాయితమూర్తియై హరిహరంబగు రూపముదాల్చి 'విష్ణురూ
పాయ నమశ్శివాయ' యని పల్కెడు భక్తజనంబు వైదిక
ధ్యాయిత కిచ్చమెచ్చు పరతత్త్వముఁగొల్చెద నిష్టసిద్ధికిన్. 12

అని హరి హరనాథుని స్తుతించి కావ్యారంభం చేశాడు.

కవిబ్రహ్మను అన్నిటా అనుసరించడమే గాక అన్నివిధాలా తిక్కన అంతటి వాడయిన నాచన సోమన ఉత్తర హరివంశాన్ని హరి హర నాథుని కంకితం చేశాడు. తిక్కనవలె హరిహర నాథుడు వేదవ్యాస మహర్షి సంపూజితుడని సోమన పేర్కొన్నాడు. కావ్యారంభంలో "వేదవ్యాస ముని మనోనివాస హరిహరనాథా !" (1-1.) అని సంబోధించాడు. తన కావ్యంలో హరిహరనాథ తత్త్వాన్ని ప్రతిపాదించాడు. కొన్ని తావుల్లో పాత్రల ద్వారానూ, కొన్ని పట్ల స్వయంగానూ హరిహరనాథ తత్త్వాన్ని కొనియాడాడు.

### 4.2.1. పాత్రల ద్వారా ప్రతిపాదించిన హరిహరనాథ తత్త్వం :

ఉత్తర హరివంశ ద్వితీయాశ్వాసంలో సోమన హరిహరనాథ తత్త్వాన్ని విస్పష్టం చేశాడు. జనమేజయుడు కృష్ణుడు కైలాసనగానికి వెళ్ళిన వృత్తాంతాన్ని తెలియజేయుమని వైశంపాయనుని కోరే సందర్భంలో హరిహరుల అద్వైత భావాన్ని గురించి లెస్సగా కొనియాడాడు. "పరివాదాస్పద వాదమోహ మదిరాపానంతో మత్తులై హరి మేలని, హరుడు మేలని లోకులు వివాదానికి దిగుతారు. హరిహరులు మాత్రం

12. ఆంధ్ర మహా భారతము - విరాట పర్వము. 1-1

ఒక్కరే కైలాస నగంలోని ఋషుల శివకేశవ స్తుతి ఇందుకు పరమ ప్రమాణం శివకేశవులకు భేదాన్ని ఆపాదించడం మోహమూ, ద్రోహమూ అవుతుంది. జగత్కార్యాచరణార్థం భిన్న రూపాల్ని ధరించిన వీరు ఒక్కరై భేదవాదుల్ని హాస్యాస్పదులుగా చేస్తారు" అని ప్రసంగ ధోరణిలో ప్రవచించాడు. నిజానికి ఈ ప్రసంగం జనమే జయుందికాదు. నాచన సోముని హృదయాంతరాళాన్నుండి వెల్లుబికి వెలికి వచ్చిన భావఝరి

మ. పరివాదాస్పద వాద మోద మదిరాపానంబుచే మత్తులై
హరిమేలంచు హరుండు మేలనుచునాహా కొందఱే పొందెఱుం
గరు కైలాస నగంబు నందు మునులేకత్వంబు భావించి రా
మురవైరింబుర వైరిఁ బాపుట మహామోహంబు
ద్రోహంబగున్. 13

క. పదునాలుగు లోకంబులుఁ
బొదలింపం ద్రుంప వలసి పొడపులు రెండై
తుదిఁ దా రొక్కటి యగుదురు
వదరలఁ జేయుదురు భేదవాదుల నెల్లన్. 14

కైలాస నగంలో శౌరి తపస్సు పరిపూర్ణమయింది ఫాలాక్షుడు ప్రత్యక్షమయ్యాడు ఆ దృశ్యాన్ని చూడ వచ్చిన దేవముని గణాదులు హరిహరుల్ని కీర్తించారు. భిన్నత్వంలో ఏకత్వాన్ని దర్శించి ప్రతిపాదించారు.

సీ. పారసంబున లేవ నారసంబునఁ జావఁ
బద్మాసనుఁడు వీరి పాలఁగనియొ
రూపు కంటఁ జెలంగఁ జూపు మంట లడంగఁ
బంచబాణుఁడు వీరి పాలఁగనియొ

13. ఉత్తర హరివంశము 2-68
14. ఉత్తర హరివంశము. 2 69

వరములు పడయంగ శరములు గెడయంగఁ
బంక్తి కంఠుడు వీరి పాలఁగనియెఁ
గేహరక్ష నటింప దేహశిక్ష ఘటింప
బాణాసురుడు వీరిపాలఁ గనియెఁ

తే. గనియెఁ చిత్రంబులకు వీరు కలసియుండి
మనుపఁజెఱుపంగఁజెఱుపంగ మనుపనేర్తు
రెల్లలోకంబులకు దైవమేకమగుట
హరిహరాత్మకె మెఱఁగిరి మనిరి సురలు. [15]

ఈశ్వరుడు పుత్రార్థి అయి వచ్చిన కృష్ణుని విష్ణువుగా గుర్తించాడు. విష్ణు మాహాత్మ్యాన్ని వేనోళ్ళ వినుతించాడు. విష్ణువు తాను భిన్నులు కారనీ ఏకమేనని స్పష్టం చేశాడు. కృష్ణు నుద్దేశించి చెప్పినట్టు ఈ పద్యాలు సాగాయి. అంటే శివకేశవు లిద్దరికీ హరిహరాద్వైత సిద్ధాంతం అంగీకార్యమేనని అభిప్రాయం.

సీ. నీయంద జనియించె నీ యంద నిఖిలంబు
నడఁగె నీ వాది మధ్యాంత మగుట
నేన నీవన నీవ నేనన వర్తింతు
మిరువుర శబ్దార్థ మేకరీతి
నీ నామములు నాకు నా నామములు నీకు
నీకుఁ జేసిన పూజ నాకుఁబూజ
నిన్ను నొల్లని వార నన్ను నొల్లనివార
లెచట నీయునికి నా కచట నునికి

15. ఉత్తర హరివంశము. 2–181

తే. జెల్లినది చెల్లుచున్నది చెల్లనున్న
యది సమస్తంబు నీవ నీ కనభిగమ్య
మెదియును లేదు వేదంబు లెఱుంగు నవియు
నీవ వా నమస్కారంబు నిన్నుఁజేరు.[16]

క. ఏ మిరువురు నేకంబిది
నా మర్గ్యజురాది తత్త్వ సారము హరిచేఁ
గామార్థ ధర్మ మోక్ష
శ్రీ మహిమలు మీాతపంబు నేర్చు ఫలంబుల్.[17]

సోమన సయితం ప్రత్యక్షంగా పలు పద్యాల్లో హరిహరనాథుని మనసారా కొనియాడాడు. హరిహరులకు అభేదం పాటించి ధ్యానించడం తిక్కన మార్గమయినా హరిహరుల్ని భిన్నంగా వర్ణించి ఏకంచేసిముగించే సంప్రదాయాన్ని సోమన పాటించాడు.

సీ. అభ్రంకషంబైన యాలపోతు నితండు
ప్రతుంచినాఁడీతండు పెంచినాఁడు
సాధుసమ్మతముగా సామజంబు నితండు
కాచినాఁడీతండు ద్రోచినాఁడు
బర్హిర్ముఖార్థమై పర్వతేశు నితండు
తాల్చినాఁడీతండు వ్రాల్చినాఁడు
ఫణపరంపరతోడి పన్నగేంద్రు నితండు
మెట్టినాడీతండు చుట్టినాఁడు

తే. నేఁను నాఁడును నాఁడును నేఁడు మనకుఁ
జూపఁ జెప్పంగఁ జెప్పంగఁ జూపఁగలిగె

16. ఉత్తర హరివంశము 2-212 17. ఉత్తర హరివంశము, 2-214

ననుచుఁ గొనియాడు సంయమిజనుల కొదవె
రజతగిరిమీఁద హరిహరారాధనంబు.[18]

హరిహరుల ఆకారసంయోజనం లాగే తత్త్వాల్లో కూడా భేదం లేదని చెప్పడం కోసం పలు పద్యాల్ని సోమన రచించి ఉన్నాడు. ఉదాహరణకు.

క. చక్ర పరశ్వధ యుతదో
ర్విక్రమ జిత దానవేంద్ర వివిధ వినోదా
పక్రాంత హృదయ భవ్యా
శక్ర ప్రముఖా మరౌఘ సతత నిషేవ్యా.[19]

శా. పారావార నగాధిరాజ తనయా సాంగేక్షణో దంచిత
శ్రీరాజ త్పుల కావళీవరతను ప్రీతి ప్రకాశాంతరా
కారుణ్యామృత వర్షి భాషణ విధా కళ్యాణ రత్నాకరా
దూరీ భూతతరాంత రాయనివహా దుష్టాత్మ శిక్షాపరా.[20]

మంత్రోపాసనలో తిక్కన హరిహరుల గురించిన బీజాక్షరాల్ని అనుసంధానించినట్లే సోమన సంధ్యాకాల మూల జపమయిన గాయత్రిలో ఓంకార కలిమిని పేర్కొని వేదాది అయిన ఓంకారాన్ని శివపరంగా వేదమాత అయిన గాయత్రిని విష్ణుపరంగా సమన్వయం చేశాడు.

బాణాసురుని కథలో కూడా శైవవైష్ణవ జ్వరాల ప్రసక్తి విషయంలో హరిహరాభేదత్వం ప్రకటింపబడింది. శైవ జ్వరం వచ్చి కృష్ణుని తాకింది. ఆ జ్వరం ప్రవేశించడంతోనే కృష్ణుడు వివశుడయ్యాడు అంటే తమోగుణావిష్టుడయ్యాడు. తన్నుతాను మరిచి పోయాడు తమోగుణం ఎక్కువగా ఉంటుంది కృష్ణుడు వైష్ణవ జ్వరాన్ని ప్రయో

18. ఉత్తరహరివంశము 2-180.
19. ఉత్తర హరివంశము. 4-320
20. ఉత్తర హరివంశము. 3-315.

గించాడు. అంటే సత్వగుణాధిక్యం కలిగించి. అష్టేశివకేశవ సమరంలో పాశుపాతులు ప్రయోగిపంబడ్డాయి. ఆరెండూ సమానంకావడంవల్ల వారే ఉపసంహరించుకొన్నారు. శివుడు త్రిపురమథనాస్త్రం ప్రయోగింపగా కృష్ణుడు భయపడ్డాడు. కృష్ణుడు జృంభణాస్త్రం ప్రయోగింపగా పరమశివుడు లోలుడయ్యాడు. సత్వగుణం మూలవస్తువై లోకంయొక్క సుస్థితిని పాలిస్తుండగా తమోగుణం లోకంలో వ్యాపిస్తుంటుంది లోక ప్రవర్తనంలో విష్ణువుకైనా శివాజ్ఞ అవసరం ఈ గుణద్వయ సిద్ధాంతాన్ని సోమన స్పష్టపరిచాడు.

స్వీకరించిన ఇతివృత్తాన్ని బట్టి పాత్రల ద్వారా, స్వయంగా హరిహరనాథ తత్త్వాన్ని ఎక్కువగా ప్రతిపాదించే అవకాశం తిక్కనకు తక్కువ. సోమనకు ఎక్కువ. ఈ అవకాశాన్ని చక్కగా వినియోగించుకొని వీలు కలిగినప్పుడల్లా హరిహరాద్వైత సిద్ధాంతాన్ని సోమన ప్రతిపాదించాడు. గురుతుల్యుడయిన తిక్కన అడుగుజాడల్లో నడచి గురువుకు మించిన శిష్యుడనదగ్గ ప్రౌఢిమను, విజ్ఞతను ప్రదర్శించాడు. ఆశయ సాఫల్యంలో కృతకృత్యుడయ్యాడు.

### 4.3. శైవ వైష్ణవ సంప్రదాయాలు :

సోమన ఉత్తర హరివంశంలో శైవ వైష్ణవ సంప్రదాయాల్ని రేఖా మాత్రంగా చిత్రించాడు. అతడు హరిహరాద్వైతి కాబట్టి శైవుల వైష్ణవుల వేషభాషల్ని గురించి గానీ ఆహార విహారాల్ని గురించి గానీ ఆసక్తి చూపి ఉండకపోవచ్చు.

#### 4.3.1. శైవ సంప్రదాయం :

శివుడే పరదేవత అనడమే శైవ సంప్రదాయంలోని ప్రధాన లక్షణం. శివుడు సృష్టి స్థితి లయ కారకుడు. సర్వమూ అతని సంకల్పం ద్వారానే జరుగుతుంది. బ్రహ్మవిష్ణువులే గాక తక్కిన దేవతలు, లోకపాలకులు, లోకాలు అన్నీ అతని అధీనంలోనే ఉంటాయి. ఈ అంశాలు ప్రతిబింబించే పద్యాలెన్నో సోమన రచనలో చోటు చేసుకొన్నాయి.

కృష్ణుడు సాక్షాత్ విష్ణువు. అతడు కూడా సర్వశక్తిమంతుడనే మన పురాణ కథనం అయినప్పటికీ పుత్రార్థి అయి శివునిగురించి తపస్సు చేయడం కోసం కృష్ణుడు

కైలాసానికి వెళ్లడం, శివుని కొనియాడటం మొదలైన అంశాలు శివపారమ్య ప్రతిపాద కాలని చెప్పక తప్పదు. కృష్ణుడు స్వయంగా శివుడే మొదలివేలుపని కొనియాడి ఉండటం గమనింపదగి ఉంది.

సీ. కల్హార మకరంద కలిత మందాకినీ
లహరీపరీత కోలాహలంబు
చాలేందు చంద్రికా పరభాగ శోభాప
రాగ సంభావితారగ్వధంబు
సేవాసమాసన్న సిద్ధసీమంతినీ
తాల వృంతోత్తాల తాండవంబు
కాత్యాయనీదత్త కర్ణావతంస క
ర్హార ఖండామోద పూరితంబు

తే. మారుతంబు నావిూఁదట మలసియాడ
గలుగునొకో నాకు నొకనాఁడు కన్నులార
శివునిఁజూచు పుణ్యంబను చింత నెఱయ
మొదలివేలుపుఁబొడగంటి మ్రొక్కఁగంటి.[21]

శివుణ్ణిఆశ్రయిస్తే సర్వమూ సిద్ధిస్తుందనే శైవుల విశ్వాసానికి కృష్ణుడు చేసిన శివస్తుతి లోని కొన్నివాక్యాలే ప్రోద్బలకాలు.

సీ. కుజము కుంజరముచేఁగూలునో కూలదో
కూలు కుంజరము నీకుజము కూల్చె
మ్రానుపేరేటిచే మడుఁగునో మడుఁగదో
మడుఁగు పేరేటి నీమాను మడిఁచెఁ
గాలునో యొకనిచేఁగాలదో సాలంబు
కాలునీసాలంబు కాల్చె నొకని
దునియునో పరశుచేఁదునియదో వృక్షంబు
తునియు నీవృక్షంబు తునిమెఁబరశు

15. ఉత్తర హరివంశము. 2–173

నాచనసోమన భక్తితత్త్వం

తే. వనుచుఁదమలోనఁ జర్చించు నమరవరుల
కభిమతార్థ ఫలార్థమై యందవచ్చు
పారిజాతంబు నా మ్రోలఁబండియుండ
నందఁగంటి నా కోర్కుల నందఁగంటి. [22]

శైవులు రుద్రాక్షల్ని, విభూతి రేఖల్ని ధరిస్తారు. ఈ అంశాన్ని సోమన రేఖా మాత్రంగా స్పృశించాడు. శివుని వల్ల వరాలు పొందిన హంసడిభకులు మసలిన తీరును సోమన చిత్రించిన వైనం శైవ సంప్రదాయానికి అద్దం పట్టింది.

క. కవచధను రస్త్ర నికరము
నవిరళ రుద్రాక్ష మాలికాభరణములున్
ధవళ విభూతియు హరహర
శివశివ శబ్ధములుఁ గలిగి చెలువయి యున్నన్. [23]

శైవులు జంగాలని కూడా పిలువబడతారు. వారు పలుచోట్ల పర్యటించి శైవ మత వ్యాప్తికి కృషిచేస్తారు. వారి నియమ నిష్ఠలు, ఆచార వ్యవహారాలు విలక్షణంగా ఆసక్తికరంగా ఉంటాయి. సోమన వాటన్నిటినీ సమగ్రంగా చిత్రించడానికి ఇష్టపడి ఉండక పోవచ్చు. అతడు అద్వైతి కావడమే అందుకు కారణం కావచ్చు.

## 4.3.2. వైష్ణవ సంప్రదాయం :

వైష్ణవ సంప్రదాయంలో విష్ణువే పరదేవత. ఆయన ఆదిమధ్యాంత రహితుడు. సృష్టి స్థితిలయ హేతుభూతుడు. బ్రహ్మశంకరాది దేవతలు, దిక్పాలకులు, సమస్త లోకాలు అతని సంకల్ప మాత్రాన్నే సృజింపబడి అతని ఇచ్ఛానుసారంగా వర్తిస్తుంటాయి. అతని విభూతి అవాఙ్మానస గోచరం. సృష్టిలోని ప్రముఖాంశాలన్నీ అతని అంశనుండే ఉద్భవించాయి. ఆ అంశలన్నీ తానే అని కృష్ణుడు శ్రీమద్భగవద్గీత దశమోఽధ్యాయంలో (విభూతియోగం) పేర్కొన్నాడు. ఈ విషయాన్ని తలపించే విధంగా సోమన ఈశ్వరుడు చేసిన విష్ణుస్తుతిని తెలియజేశాడు

22. ఉత్తర హరివంశము. 2-176 23. ఉత్తర హరివంశము 4-15

సీ. ఆగుదు ఛందముల గాయత్త్రి వర్ణంబుల
యందకారము తద్రుదులందు నేను
ననలుండు వసువులందాదిత్యులందు వి
ష్ణుండు వాస్తోష్పతి సురల యందు
గజములలో నింద్రగజము పక్షులలోన
గరుడుండు నరులలో నరవరుండు
నిర్జరవరులలో నీరజాసనుండు వృ
క్షముల నశ్వత్థంబు శైలములను
తే. మేరుగిరి దేవమునులలో నారదుండు
దైత్యులందుఁ బ్రహ్లాదుండు ధనదవిభుఁడు
కిన్నరులయందు వాసుకి పన్నగముల
లోన మృగములలోనఁ బంచాననంబు.[24]

వైష్ణవులు విష్ణువునేగాక విష్ణువుకు సంబంధించినవస్తువాహనాల్ని, విష్ణు భక్తుల్ని సమానంగానే భావిస్తారు. చక్రాన్ని సుదర్శనాళ్వార్ అనీ గరుడని గరుడాళ్వార్ అనీ పిలిచే ఆచారం నేటికీ వైష్ణవుల్లో ఉండటం గమనింపదగినది, సోమనచేసిన చక్రస్తుతి దీనికి ప్రతిబింబమని చెప్పవచ్చు. కృత్యను తరుముకొని వచ్చే చక్రాన్ని బ్రహ్మ దేవుడు వినుతించాడు. దేవతలు కొనియాడారు. ఈశ్వరుడు కూడా చక్ర మాహాత్మ్యానికి జడిసి కాశీనగరం విడిచిపెట్టి పోయాడు జనమేజయునికి చక్రకథావార్చనల మాహాత్మ్యాన్ని తెలిపాడు.

................గగనంబున నిగుడు నచ్చక్రంబుం గనుంగొని.[25]

క. సురగరుడ యక్ష విద్యా
ధరకిన్నర దివ్యమునులు తద్దర్శనమం

---

౨౪. ఉత్తర హరివంశము. ౨-211

౨౫. ఉత్తరహరివంశము ౬-144

స్మరణ ప్రణామ పూజా
పరతంత్రతఁ జెరువు దొలఁగి బలసిరి చదలన్. 26

క. పురుహూత ముఖ్యదిక్పా
లురు సేవింపంగ సకల లోకేశ్వరుఁడౌ
బురుహాసనుఁడు గని నమ
స్కరించి వినుతించె నిజముఁ గైవారముగాన్. 27

సీ. దైతేయ మదవతీ ధమ్మిల్లములతోడ
విరుల నెత్తావికి వీడుకోలు
దనుజ శుద్ధాంత కాంతా కటాక్షములతోఁ
గలికి కాటుకలకుఁ గానివావి
దానవ మానినీ స్తన కుంభములతోడఁ
బసుపుఁ బయ్యెదలకుఁ జాయ తెరువు
దైత్యావరోధనదయితా ధరములతో
సొబగు వీడెములకుఁ జుక్క యెదుర

తే. చేసి సుర సుందరీ కరోశీర తాల
వృంత చలితాంత కుంతల షట్పదింద్ర
కుల వధూటీ లలాటికా కుంకుమంబుఁ
బదిల పఱుపఁ జక్రంబ నీ భరము కాదె. 28

మ. సతతంబు న్నుతియింతు జంతుమయ సంసార క్రియారక్షణా
క్షతశౌర్యక్షపితారిపక్షమగుటన్ సంగ్రామ భీమ భ్రమా
గత గేహాంతిక దీర్ఘికాతటలు తత్కాంత చ్ఛిదాచ్ఛాదన
క్షతజజ్వాళితకేలి తామరసరక్షశ్చక్రముం జక్రమున్. 29

---

26. ఉత్తర హరివంశం 3-145  27. ఉత్తరహరివంశము 3-146
28. ఉత్తర హరివంశము 3-147.  29. ఉత్తర హరివంశము 3-149

ఉ. ఆ పరమేశ్వరుండు జగదంబికతోఁ బ్రమథ ప్రజంబుతో
గోపతితోడఁ జక్రమునకుం జనమెక్కుడు పోదమంచుఁ గా
శీపురి నుండనొల్లక తిశీఘ్ర గతిన్ శతయోజనంబులం
దాపసయోగ్యమై పరఁగు తాలవనంబున కేఁగె నెమ్మదిన్.[30]

ఈ అంశాల్ని తెలియజేయడం ద్వారా సోమన చక్రం గొప్పతనాన్ని చాటినట్టయింది ఇదివైష్ణవ సంప్రదాయాను గుణంగానే ఉంది.

నుదుట నామాలు, మెడలో తులసిపేరు, భుజాల మీద చక్రాంకితాలు, నాలుక మీద విష్ణునామం, మనసులో మాధవుని పాదాలు వైష్ణవుల ముఖ్యలక్షణాలు. హరి భక్తుల పట్ల ఆదరభావం వైష్ణవులకు జన్మసిద్ధం. సోమన ఈ అంశాలన్నింటినీ సమగ్రంగా చిత్రించలేదు కృష్ణ పారమ్య బోధకమే ఉత్తర హరివంశంలో అతని లక్ష్యంగా ఉండటంవల్ల విష్ణుమాహాత్మ్యాన్ని వీలైనంత ఎక్కువగా చిత్రించినట్టు తోస్తుంది.

ఆయా సందర్భాల్లో శివకేశవుల మహాత్మ్యాలతోబాటు శైవ వైష్ణవ సంప్రదాయాల్ని సమగ్రంగా చిత్రించవలసి ఉంది. కానీ కథాపరిధిలో ఈ అవకాశం తక్కువగా ఉండటంవల్లనూ, తాను అద్వైతి కావడం వల్లనూ సోమన పై అంశాల్ని ఇలా రచించి ఉండవచ్చు.

నాచన సోమనాథుడు నవీన గుణ సనాథుడు. పాతకన్నా కొత్తనే అభిమానించి ఆదరించేవాడు కొత్త ఆశయాలతో పురోగమించేవాడు. కాబట్టే తిక్కన హరిహర నాథతత్త్వం ఇతన్ని ఆకర్షించింది. అనుసరించాడు. తన కావ్యంలో అనేకచోట్ల ప్రతిపాదించడానికి ప్రయత్నించాడు. తన ప్రత్యేకతలతో కావ్యంలో పలుచోట్ల చక్కని ముద్రవేశాడు. తన పూర్వుల కంటే విలక్షణమయిన స్థానాన్ని ఆంధ్ర సాహిత్య పథంలో సంపాదించు కొన్నాడు.

---

30. ఉత్తర హరివంశము. 3-151

# విష్ణుభక్తి

నాచన సోమన కాలానికి సంబంధించి భిన్నాభిప్రాయాలున్నా అతడు క్రీ॥శ॥ 1285 ప్రాంతంలో జన్మించి క్రీ॥ శ॥ 1355 ప్రాంతం వరకు జీవించాడని సర్వులూ అంగీకరిస్తున్నారు. వాసస్థానానికి సంబంధించి మాత్రం సర్వజనామోద యోగ్యమయిన అభిప్రాయం ఇంకా ఏర్పడలేదు. అనేక బిరుదాలున్న సోమన మహా పండితుడుగా మహా కవిగా మన్నన పొందాడనడంలో విప్రతిపత్తి లేదు. నాటికి కొంత కొత్త పద్ధతిలో కవనం చెప్పినా ప్రాచీన సంస్కృత సాహిత్యాన్ని ఆంధ్రీకరించడంలో ప్రాచీన కవులెవరికీ తీసిపోయినవాడు కాడు. కాబట్టి ఇతని రచన పాత ప్రసవించిన కొత్తగా మనకు గోచరిస్తుంది. చతురుడు, చమత్కారి, రసికుడు అయిన సోముడు మంచి భక్తుడని కూడా తన రచన ద్వారా నిరూపించు కొన్నాడు.

"ఆకాశాత్ పతితం తోయం యథాగచ్ఛతి సాగరమ్
సర్వదేవ నమస్కారః కేశవం ప్రతిగచ్ఛతి". 1

అన్నట్టుసర్వదైవాత్మకుడయిన విష్ణువు పట్ల ఇతనికి భక్తిమెండు. తన భక్తిని ప్రదర్శించి భగవదనుగ్రహాన్ని సంపాదించాలనీ పాఠకుల్ని కూడా విష్ణుభక్తి పరవశులుగా చేసి ఉన్నతస్థితికి చేర్చాలనీ ఉత్తర హరివంశ రచనకుపక్రమించినట్టున్నాడు. అందుకే కాబోలు హరివంశములోని అన్ని కథల్నీ తీసుకోక విష్ణుపారమ్య బోధకాలయిన ఇతివృత్తాల్ని మాత్రమే స్వీకరించాడు. వీటిని పఠిస్తే విష్ణువు సర్వాధిక్యత, సర్వశక్తి సంపన్నత మనకు స్ఫురిస్తాయి.

నాచనసోమన ప్రతిపాదించిన భక్తితత్త్వం మహాత్ముల భక్తినిర్వచనాలకు అనుగుణంగానూ భక్తిలక్షణ సమన్వితంగానూ ఉంది. భాగవతంలో ప్రహ్లాదుడు ప్రతిపాదించిన నవవిధభక్తి మార్గాల్లో ఆరుమాత్రమే ఈయన కావ్యంలో చోటు సంపాదించాయి. అవకాశం లేకపోవడం చేతనో మరెందువల్లనో తక్కిన మూడు అంశాల్ని సోమన స్పృశించలేదు. తానుస్వయంగా అయా ఘట్టాల్లో అయా

---

1. సూక్తిసుధా – శ్లోకం 44.

వేల్పులపట్ల భక్తిభావాన్ని ప్రదర్శించడమేగాక తాను సృజించిన పాత్రల ముఖంగా కూడా భక్తిభావాన్ని ప్రదర్శింపజేసి భక్తిపట్ల తనకున్న మక్కువను ఋజువు చేసుకొన్నాడు. కృష్ణునిపట్ల బదరికాశ్రమ ఋషుల భక్తి, దేవేంద్రుని భక్తి, భూదేవిభక్తి ఘంటాకర్ణునిభక్తి, శివుని భక్తి, అర్జున ధర్మరాజాదులభక్తి, నారదునిభక్తి దుర్వాసుల భక్తి, జనార్దనునిభక్తి, పుష్కర సరస్తీరస్థ ఋషులభక్తి, సిద్ధసాధ్య చారణ గంధర్వుని భక్తి ఇందు పేర్కొనదగ్గవి. శివునిపట్ల కృష్ణునిభక్తి, బాణాసురుని భక్తి గమనించదగి ఉన్నాయి. ఇలా ప్రతిపాదింపబడిన భక్తుల్లోకూడా విష్ణుభక్తివిశిష్టత గోచరిస్తుంది.

విష్ణుపారమ్యతను చాటి చెప్పటమే గాక కృష్ణుడే విష్ణువని చక్కగా నిరూపించాడు. పాత్రల ద్వారా నిరూపింపజేసాడు. ఇతని మనసు విష్ణువుపట్ల కొంత మొగ్గు చూపినా హరిహరాభేదాన్ని అంగీకరించింది. శైవ వైష్ణవ సంప్రదాయాల్ని చక్కగా తెలిసిన సోమన వాటిని మేళవింపజేసి హరిహర నాథతత్త్వానికి ప్రాధాన్యమిచ్చాడు. మహాకవిగా, మహాపండితుడుగానే గాక విష్ణు భక్తుడుగా హరిహరనాథ తత్త్వాన్ని సమర్థించినవాడుగా సోమన ఆంధ్ర సాహిత్యంలోనూ ఆంధ్రచరిత్రలోనూ అత్యున్నతస్థానం సంపాదించడం అతిశయోక్తి గాదు.



# ఉపయుక్త గ్రంథ సూచిక


1. కళాప్రపూర్ణ కోదండరామిరెడ్డి, మరుపూరు. — తిక్కనసారస్వతమూర్తి (కవితా శిల్పవిలసనము-పదబంధ సౌరభము), వెల్డన్ ప్రెస్, 68 మన్నప్పమొదలి వీధి, మద్రాసు-21.

2. డా॥ కామేశ్వరరావు, వేదుల — నాచన సోమనాథుడు (కావ్యానుశీలనము), లక్ష్మీపతి పబ్లికేషన్స్, పెద్దాపురం, ఆగస్టు 1979.

3. డా॥ చంద్రశేఖర్, ఎస్వీడి. — భావకవులు- భక్తితత్వం ఎస్వీడిపబ్లికేషన్స్, తిరుపతి.

4. నాగసిద్ధారెడ్డి, డి. — శ్రీమద్భాగవత పురాణ పరిశీలనము, తిరుమల తిరుపతిదేవస్థానములు తిరుపతి 1980.

5. నీలకంఠశాస్త్రి, ఓరుగంటి. — శ్రీ తిక్కయజ్వ హరిహరనాథ తత్త్వము - వేదము వేంకటరాయ శాస్త్రి అండ్ సన్స్, 4 మల్లికేశ్వర స్వామి గుడి సందు, తింగిశెట్టివీధి, మద్రాసు -1

6. డా॥ మునిరత్నం, జె — అన్నమయ్య ఆళ్వారులు - తులనాత్మక పరిశీలన. అముద్రిత సిద్ధాంత వ్యాసం శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం తిరుపతి, ఫిబ్రవరి 1986.

7. డా॥ (శ్రీమతి) యశోదారెడ్డి, పి. — తెలుగులో హరివంశములు
సుధర్మ పబ్లికేషన్స్
3-4-574 నారాయణగూడ,
హైదరాబాదు - 500 029

8. ఆచార్య సచ్చిదానందమూర్తి, కొత్త. — విజ్ఞాన సర్వస్వము, ఏడవ
(సంపాదకులు) సంపుటము (దర్శనములు-మతములు)
శ్రీ వరాహ నరసింహస్వామి, మేడేపల్లి. తెలుగు భాషా సమితి
(సంగ్రాహకులు) హైదరాబాదు : మద్రాసు : :
వాల్తేరు 1962

9. డా॥ సుప్రసన్నాచార్య. కోవెల. —సహృదయచక్రము
(సాహిత్యవ్యాస సంపుటి)
శ్రీవాణీ ప్రచురణలు,
వరంగల్.

10 సోమన, నాచన — ఉత్తర హరివంశము
(పీఠిక-వేటూరి ప్రభాకరశాస్త్రి)
వావిళ్ళ రామస్వామిశాస్త్రులు
అండ్ సన్స్, మదరాసు-1.

## వ్యాసాలు.

1. డా॥గోవిందస్వామినాయుడు, యం.— నాచనసోమన హరిహర
నాథతత్త్వము. సద్గురువాణి
(త్రైమాసికపత్రిక), ఏప్రిల్, 1984.

2 సుబ్రహ్మణ్యం, సిష్టల. — శక్తి-హరిహరనాథతత్త్వం
సప్తగిరి (తిరుమల తిరుపతి దేవస్థానముల
మాసపత్రిక)
జనవరి, 1984.



# తప్పొప్పుల పట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
| --- | --- | --- | --- |
| 1 | 12 | మాచయ్య్రబ్రాహ్మడని | మాచయ్యబ్రహ్మడని |
| 2 | 11 | ధారాదత్తం చేశాడు | ధారాదత్తం చేశాడు |
| 3 | 9 | శ్రీవిద్యారణద | శ్రీవిద్యారణ్య |
| 3 | 10 | [ధాత్మనాడు | ధాత్మనాడు |
| 4 | 4 | తారణసంవత్సరం నాడు | తారణసంవత్సరం నాడు |
| 4 | 20 | స ్వసమర్థుడయిన | సర్వసమర్థుడయిన |
| 6 | 21 | సుపసిద్ధ | సుప్రసిద్ధ |
| 6 | 23 | లీలోద్వాన | లీలోద్యాన |
| 7 | 2 | కొద్దిమార్పుల్లో | కొద్దిమార్పుల్తో |
| 7 | 5 | పేరునట్టు | పేరున్నట్టు |
| 7 | 17 | మొత్తెపురుల్లకులతో | ముత్తైపురుల్లకులతో |
| 7 | 21 | సరసేనవఅపెన్ | సీరసేనవటుపెన్ |
| 8 | 12 | ఉదహరించాడు | ఉదాహరించాడు |
| 8 | 22 | ఆక్రూరుడు | ఆక్రూరుడు |
| 9 | 2 | ఉదహరించాడు | ఉదాహరించాడు |
| 10 | 12 | వీటినిగురించి | వీటిని గురించి |
| 11 | 11 | ప్రవర్తతె | ప్రవర్తతే |
| 11 | 15 | సూక్ష్మభేదమున్నా | సూక్ష్మభేదమున్నా |
| 11 | 23 | శాబ్దార్థలచేత | శబ్దార్థాలచేత |
| 12 | 8 | జరించదీ | జరించెదీ |
| 12 | 12 | అనేలోపద్యం | అనే పద్యంలో |
| 12 | 16 | పలపునీతుల | పలంపునీతల |
| 13 | 4 | మేర్పనప్పుడు | మేర్పడినప్పుడు |
| 13 | 12 | పాధాన్యం | ప్రాధాన్యం |
| 14 | 8,9,12 | ధనస్సు | ధనుస్సు |
| 15 | 16 | వెదనలో | వేదనలో |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 15 | 17 | నహజోక్తి | సహజోక్తి |
| 15 | 19 | లజ్జలేదు | లజ్ఞలేదు |
| 15 | 21 | తి | చేతికి |
| 16 | 15 | ప్రస్తుతింపబడ్డాపు | ప్రస్తుతింపబడ్డాడు |
| 19 | 22 | సామర్ద్యం | సామర్థ్యం |
| 21 | 3 | ఋషిల్ని | ఋషుల్ని |
| 21 | 17 | మహిష్మతి | మాహిష్మతి |
| 22 | 8 | వున | గావున |
| 23 | 3 | ఎట్లపనని | ఎట్లవునని |
| 23 | 26 | నిందించే | నిండించే |
| 24 | 11 | వస్తాడని మింగినట్టు | వస్తాడని వారిని మింగినట్లు |
| 24 | 18 | తెలిసింది | తెలిపింది |
| 25 | 22 | కోరుకోమ్మన్నాపు | కోరుకొమ్మన్నాడు |
| 25 | 23 | పరానను గ్రహించి | పరాన్ననుగ్రహించి |
| 26 | 2 | నంబారాలు | సంబారాలు |
| 26 | 4 | అకోలాహలాన్ని | ఆ కోలాహలాన్ని |
| 27 | 10 | భయకంతుల్ని | భయకంపితుల్ని |
| 27 | 14 | పౌంద్రిక | పౌండ్రక |
| 27 | 21 | ఖేదం | షేదం |
| 27 | 26 | రాళ్లు | రాళ్లు |
| 28 | 20 | వారిద్గర్కి | వారిద్దర్కి |
| 29 | 20 | సమీపించ | సమీపించి |
| 30 | 2 | దంతం | దండం |
| 30 | 24 | బ్రహ్మదత్తాదున్న | బ్రహ్మదత్తాదుల్ని |
| 31 | 1 | చెప్పాపు | చెప్పాడు |
| 31 | 12 | చెవ్విన కప్పం | చెప్పిన కప్పం |
| 31 | 19 | కృష్ణదేపన్నాడు | కృష్ణదేమన్నాడు?" అని మాట్లాడాడు |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 32 | 19 | కృష్ణదేవన్నాడు | కృష్ణదేవన్నాడు॥" అని |
| 33 | 20 | షణ్ముఖునిలా | షణ్ముఖునిలా |
| 34 | 15 | మర్జాలాలు | మార్జాలాలు |
| 35 | 16 | కలిగికచింది | కలిగించింది |
| 36 | 22 | కుంభాడుకు | కుంభాండుడు |
| 37 | 1 | ద్వారకతో | ద్వారకలో |
| 38 | 5 | నివారించవని | నివారించుమని |
| 38 | 20 | కృష్ణనిలో | కృష్ణునిలో |
| 39 | 12 | నిశ్చేష్ణుడై | నిశ్చేష్టుడై |
| 39 | 17 | వైదొలగాను | వైదొలగాడు |
| 40 | 8 | బాణాసురు | బాణాసురుడు |
| 41 | 6 | పౌంద్రక | పౌండ్రక |
| 42 | 5 | పరమార్జ | పరమార్థ |
| 43 | 1 | శ్రీమదాపణానుజులు | శ్రీమద్రామానుజులు |
| 43 | 5 | శ్రీమధుసూదప | శ్రీమధుసూదన |
| 43 | 15 | శాంతీ | శాంత |
| 43 | 16 | విజ్ఞానసర్వస్వకి. | విజ్ఞాన సర్వస్వం |
| 43 | 24 | శాంతి కికి | శాంతభక్తికి |
| 43 | 28 | హనుమరాయలు | హనుమదాదులు |
| 44 | 3 | భీష్మార్జునోద్దవాది | భీష్మార్జునోద్ధవాది |
| 44 | 9 | చైతన్యాదులే | చైతన్యాదులీ |
| 44 | 15 | నరరుల | నరుల |
| 45 | 19 | శ్రీకృష్ణుడు | శ్రీకృష్ణుడు |
| 46 | 6 | స్మరణభక్తి | స్మరణభక్తి |
| 46 | 15 | పణామం | ప్రణామం |
| 46 | 19 | పుచ్చుకోపడం | పుచ్చుకోవడం |
| 47 | 2 | ప్రౌప్తించినప్పుడు | ప్రాప్తించినప్పుడు |
| 47 | 16 | ప్రశంసనీయ | ప్రశంసించినవి ప్రశంసనీయ |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 48 | 14 | సేకతంబు | సైకతంబు |
| 48 | 19 | యానవకోటి | యాదవకోటి |
| 48 | 21 | ఇత్తరహరివంశము | ఉత్తరహరివంశము |
| 49 | 3 | కృష్ణనివాదని | కృష్ణనివారని |
| 49 | 3 | సంబంధాపేన | సంబంధాపేక్ష |
| 49 | 4 | కల్పాక్ష | కల్పన |
| 49 | 8 | మహాతక్యం | మాహాత్మ్యం |
| 50 | 9 | దేంద్రునిలో | దేవేంద్రునిలో |
| 50 | 10 | కగింది | కలిగింది |
| 50 | 12 | అతకి | అతనికి |
| 51 | 1 | సీతఃతడు | సీతడు |
| 51 | 15 | కొడుకుఃజింపితి | కొడుకుఃజంపితి |
| 52 | 1 | షట్టిన | పుట్టిన |
| 53 | 22 | ఝుద్రనామ్మె | క్షుద్రనామ్నె |
| 54 | 9 | స్పష్ణోదాహరణ | స్పష్టోదాహరణ |
| 55 | 7 | కృత్సాల్ని | కృత్యాల్ని |
| 55 | 11 | జనపతులను | జనపతులును |
| 55 | 20 | రాదన్నాడు | రాడన్నాడు |
| 56 | 1 | హృదంతరాళం | హృదంతరాళం |
| 56 | 18 | కాపీనాన్ని | కౌపీనాన్ని |
| 57 | 14 | గానం | గావం |
| 58 | 18 | జన్మంబులు | జన్మంబు |
| 59 | 17 | దర్పఐం | దర్పణం |
| 60 | 1 | ప్రసంశించారు | ప్రశంసించారు |
| 60 | 2 | కీర్తించాము | కీర్తించారు |
| 60 | 18 | ఆగ్రహావిష్ణడయ్యారు | ఆగ్రహావిష్టుడయ్యాడు |
| 61 | 22 | ఖరదూషణానేక | ఖరదూషణానీక |
| 62 | 21 | చేసుకోదలచాడు | చేసుకోదలచారు |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 62 | 22 | సత్కారించాడు | సత్కరించాడు |
| 63 | 6 | సాయనముల్ | పాయసముల్ |
| 63 | 8 | వైపుణ్యం | నైపుణ్యం |
| 63 | 17 | కలత | కలిత |
| 64 | 9 | ధక్తిని | భక్తిని |
| 64 | 22 | ఆయాచితంగా | అయాచితంగా |
| 66 | 16 | సార్వభౌషుడని | సార్వభౌముడని |
| 67 | 16 | దత్త్వస్ఫితిం | దత్త్వస్థితిం |
| 67 | 22 | తేజుదగ్గఱం | తేజుడగ్గఱం |
| 69 | 3 | కృషుని | కృష్ణుని |
| 69 | 14 | తిక్కన నసుసరించే | తిక్కన ననుసరించే |
| 71 | 6 | ఋమల్ని | ఋషుల్ని |
| 71 | 18 | ఈరూప్రునఁబోలి | ఈరూపునఁబోలి |
| 72 | 8 | కొనియాడండ | కొనియాడడం |
| 72 | 19 | వాసుదేవులిద్ణరికీ | వాసుదేవులిద్దరికీ |
| 72 | 19 | కృషుడు | కృష్ణుడు |
| 73 | 2 | యొక్కంత | యొకింత |
| 73 | 7 | తెలియజేయమని | తెలియజేయుమని |
| 75 | 7 | సంతుష్ణులయ్యారు | సంతుష్టులయ్యారు |
| 76 | 5 | కృష్ణుని | కృష్ణుడు |
| 77 | 6 | ఆర్జునుడు | అర్జునుడు |
| 78 | 10 | విష్ణురూషాయ | విష్ణురూపాయ |
| 78 | 15 | వెదవ్యాస | వేదవ్యాస |
| 78 | 20 | హరిహరనాధతత్తం | హరిహరనాథతత్త్వం |
| 78 | 21 | ఉత్తరహరిసంస | ఉత్తరహరివంశ |
| 78 | 23 | అద్త్వైత | అద్వైత |
| 79 | 2 | అవుతుందీ | అవుతుంది |
| 79 | 3 | హాస్పాస్పదులు | హాస్యాస్పదులు |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 80 | 11 | స్వష్టం | స్పష్టం |
| 0 | 18 | నీకుఁజేసన | నీకుఁజేసిన |
| 81 | 3 | మెదియును | మేదియును |
| 81 | 4 | నీవవా | నీవనా |
| 82 | 19,20 | మరిచిపోయాడు | మరచినప్పుడు |
| 83 | 1 | పాశుపతులు | పాశుపతాలు |
| 84 | 6 | చాలేందు | బాలేందు |
| 84 | 14 | వుణ్యంబును | పుణ్యంబును |
| 85 | 11 | శబ్ధములు | శబ్దములు |
| 86 | 1 | ఆగుదు | అగుదు |
| 86 | 18 | జనమేజయునికి | వైశంపాయనుడు జనమేజయునికి |
| 88 | 22 | తద్దర్శసనం | తద్దర్శనసం |
| 88 | 13 | మహాత్మ్యలతో | మాహాత్మ్యలతో |
| 89 | 5 | కాంత | కొంత |
| 89 | 6 | పద్ధతిలో | పద్దతిలో |
| 90 | 4 | దుర్వాసుల | దుర్వాసుని |
| 90 | 5 | గంధర్వుని | గంధర్వుల |

# Nachana Somana Bhaktitatvamu

– Dr. M. Govindaswamy Naidu



తల్లిదండ్రులు – శ్రీమతి మానికొండ రాజమ్మ
స్వర్గీయ మానికొండ రామానాయుడు

జననం – 5–3–1953
ఉరూరుపేట, నింద్ర (మండలం) చిత్తూరు (జిల్లా)

విద్యాభ్యాసం – శ్రీ వేంకటేశ్వర ఆర్ట్స్ కళాశాల (తిరుపతి) బి. ఏ.,
శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం (తిరుపతి)
ఎం. ఏ. (తెలుగు), పిహెచ్. డి., డిప్లొమా ఇన్
లింగ్విస్టిక్స్.

వృత్తి – రీసెర్చ్ సైంటిస్ట్, తెలుగు అధ్యయన శాఖ
శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి

వ్యాసంగం – పరిశోధన, వ్యాసరచన

ప్రచురితాలు – వివిధ తెలుగు పత్రికల్లో దాదాపు 15 వ్యాసాలు